ఓం పాదాక్రాంత్యా నతభువం, కిరీటోల్లిఖితాంబరాం
క్షోభితాశేష పాతాళాం, ధనుర్జ్యానిస్వనేన తాం. 38.

ఓం దిశోభుజసహస్రేణ, సమంతాత్ వ్యాప్యసంస్థితాం
తతః ప్రవవృతే యుద్ధం. తయా దేవ్యా సురద్విషాం. 39

ఓం శస్త్రాస్త్రైః బహుధా ముక్తైః. ఆదీపిత దిగంతరం
మహిషాసురసేనానీః, చిక్షురాఖ్యో మహాసురః. 40.

ఓం యుయుధే చామరశ్చాన్యైః, చతురంగబలాన్వితః
రథానా మయుతైః షడ్భిః, ఉదగ్రాఖ్యో మహాసురః 41.

ఓం అయుధ్యతా యుతానాంచ, సహస్రేణ మహాహనుః
పంచాశద్భిశ్చ నియుతైః, అసిలోమా మహాసురః. 42.

ఓం అయుతానాం శతైషడ్భిః, బాష్కలో యుయుధే రణే
గజవాజి సహస్రౌఘైః, అనేకైః పరివారితః. 43.

ఓం వృతో రథానాం కోట్యాచ, యుద్ధే తస్మిన్ అయుధ్యత
బిడాలాఖ్యోఽయుతానాంచ, పంచాశద్భిః రథాయుతైః 44.

ఓం యుయుధే సంయుగే తత్ర, రథానాం పరివారితః
అన్యేచ తత్రాయుతశో. రథనాగ హయైః వృతాః. 45.

ఓం యయుధుః సంయుగే దేవ్యా. సహ తత్ర మహాసురాః
కోటికోటిసహస్రైస్తు, రథానాం దంతినాం తథా. 46.

ఓం హయానాంచ వృతో యుద్ధే, తత్రాభూత్ మహిషాసురః
తోమరైః భిందిపాలైశ్చ, శక్తిభిః ముసలైః తథా, 47.

ఓం యుయుధుః సంయుగేదేవ్యా, ఖడ్గైః పరశుపట్టిసైః
కేచిచ్చ చిక్షిపుః శక్తీః, కేచిత్ పాశాన్ తథాపరే. 48.

38. కాలిత్రొక్కుడులతో భూమిక్రుంగఁగా, కిరీటము ఆకసమున కొరసి కొనగా ధనుష్టంకారముతో పాతాళలోకమునుకూడ కలతపెట్టి.

39. వేలకొలది భుజములతో అంతటిని వ్యాపించియున్న దేవిని మహిషుడు చూచెను. అంత నా దేవికి రాక్షసులకు యుద్ధము జరిగెను.

40. మహిషుని సేనానాయకుడు చిక్షురుడనువాడు మిక్కుటముగా ప్రయోగించిన శస్త్రాస్త్రములతో దిగంతములు వెలుగునట్లును.

41. చామరుడనువాడు చతురంగ బలములతోడను, ఉదగ్రుడు అరువది వేల రథములతోడను,

42. మహాహను వనువాడు కోటి రథములతోను, అసిలోముడు అయిదు కోట్ల రథములతోను,

43. బాష్కలుడు ఆరుకోట్ల రథములతోడను, అనేకములైన ఏనుగులు, గుఱ్ఱములు, సైనికుల తోడను,

44. (ఉగ్రదర్శనుఁడు) కోటి రథములతోను, బిడాలుఁడు అయిదునూర్ల కోట్ల రథములతోను,

45. ఇతర రాక్షసులుకూడ వేలకువేలు రథములు, ఏనుగులతో కూడికొని.

46. దేవితోకూడ యుద్ధము చేసిరి.

47. మహిషాసురుడు కోటికోటివేల రథములతో గుఱ్ఱములతో ఏనుగులతో కూడి దేవి నెదిరించెను.

48. రాక్షస సమూహమంతయు తోమరములు, భిందిపాలములు, శక్తులు, ముసలములు, ఖడ్గములు పట్టిసములు.

ఓం దేవీం ఖడ్గప్రహారైస్తు, తేతాం హంతుం ప్రచక్రముః
సాపి దేవీ తతస్తాని, శస్త్రాణ్యస్త్రాణి చండికా. 49.

ఓం లీలయైవ ప్రచిచ్ఛేద, నిజశస్త్రాస్త్ర వర్షిణీ
అనాయస్తాననా దేవీ, స్తూయమానా సురర్షిభిః. 50.

ఓం ముమోచాసుర దేహేషు, శస్త్రాణ్యస్త్రాణి చేశ్వరీ
సోపి క్రుద్ధో ధుతసటో, దేవ్యాః వాహన కేసరీ. 51.

ఓం చచారాసుర సైన్యేషు, వనేష్వివహుతాశనః
నిశ్వాసాన్ ముముచే యాంశ్చ, యుధ్యమానా రణేంఽబికా. 52.

ఓం త ఏవ సద్యః సంభూతాః, గణాః శతసహస్రశః
యుయుధుస్తే పరశుభిః, భిందిపాలాసి పట్టసైః. 53.

ఓం నాశయంతోఽసురగణాన్, దేవీశక్త్యుపబృంహితాః
అవాదయంత పటహాన్, గణాః శంఖాన్ తథాపరే. 54.

ఓం మృదంగాంశ్చ తథైవాన్యే. తస్మిన్ యుద్ధమహోత్సవే
తతో దేవీ త్రిశూలేన, గదయా శక్తివృష్టిభిః. 55.

ఓం ఖడ్గాదిభిశ్చ శతశో, నిజఘాన మహాసురాన్
పాతయామాస చైవాన్యాన్, ఘంటాస్వన విమోహితాన్. 56.

ఓం అసురాన్ భువి పాశేన, బధ్వా చాన్యా నకర్షయత్
కేచిత్ ద్విధా కృతాః తీక్ష్ణైః, ఖడ్గపాతైః తథాపరే. 57.

ఓం విపోధితా నిపాతేన, గదయా భువి శేరతే
వేముశ్చ కేచిత్ రుధిరం, ముసలేన భృశంహతాః. 58.

ఓం కేచిత్ నిపతితా భూమౌ, భిన్నాః శూలేనవక్షసి
నిరంతర శరౌఘేణ, కృతాః కేచిద్రణాజరే. 59.

49. అను వివిధాయుధములతో దేవిని చంపఁబూనిరి. దేవియు వారు ప్రయోగించిన శస్త్రాస్త్రములనెల్ల.

50. తన శస్త్రాస్త్రములతో ఖండించివైచెను. ఆయాసము నొందని దేవిని దేవతలు. మునులు సంస్తుతించిరి.

51. చండిక వారికి తగులునట్లు శస్త్రాస్త్రములు ప్రయోగించెను. దేవి యొక్క వాహనసింహము కోపముతో కేసరములునిక్కించి.

52. రాక్షససైన్యమునందు అడవిలో కారుచిచ్చువలె సంచరించెను. దేవి యుద్ధముచేయుచు విడిచిన ఊర్పులనుండి.

53. నూర్లు వేలసంఖ్యలతో గణములు (సైన్యము) పుట్టెను. ఆ గణములు పరుశుభింది పాలపట్టసాది ఆయుధములతో.

54. రాక్షసుల సమూహములను నాశము చేయుచు దేవియొక్కశక్తితో బలపడి తప్పెట్లువాయించి శంఖములూదిరి.

55. ఆ యుద్ధమహోత్సవమునందు మృదంగములు మ్రోయించిరి. అంత దేవి శూలము శక్తి మొదలగు ఆయుధముల వర్షము కురియించెను.

56. ఖడ్గము మొదలగువానితో అసురులను నూర్లకొలది చంపెను. కొంద రను ఘంటానాదముతో వివశుల గావించెను.

57. కొందరిని పాశములతో కట్టి నేల పడనీడ్చెను. కొందరు కటారి వ్రేటులతో రెండుతుండెములుగా చేయబడిరి.

58. గదమోదులతో నేల కొరగిరి. కొందరు ఆమె రోకటిపోటులతో నెత్తురులు క్రక్కిరి.

59. కొందరు త్రిశూలముతో రొమ్మున గ్రుచ్చబడి పడిపోయిరి. బాణ వర్షములలో మునిగిపోయిరి.

ఓం సేనానుకారిణః ప్రాణాన్, ముముచుః త్రిదశార్దనాః
కేషాంచిత్ బాహవః ఛిన్నాః, ఛిన్నగ్రీవా స్తథాఽపరే. 60.

ఓం శిరాంసి పేతు రన్యేషాం, అన్యే మధ్యే విదారితాః
విచ్ఛిన్నజంఘా స్త్వపరే, పేతు రుర్వ్యాం మహాసురాః. 61.

ఓం ఏకబాహ్వక్షి చరణాః, కేచిత్ దేవ్యా ద్విధాకృతాః
ఛిన్నేఽపి చాన్యే శిరసి, పతితాః పునరుత్థితాః. 62.

ఓం కబంధా యుయుధుర్దేవ్యా, గృహీత పరమాయుధాః
ననృతు శ్చాపరే తత్ర, యుద్ధే తూర్య లయాశ్రితాః 63.

ఓం కబంధాః ఛిన్నశిరసః, ఖడ్గశక్తి ఋష్టిపాణయః
తిష్ఠ తిష్ఠేతి భాషంతో, దేవీమన్యే మహాసురాః. 64.

ఓం పాతితైః రథనాగాశ్వైః, అసురైశ్చ వసుంధరా
అగమ్యా సా భవత్తత్ర, యత్రాభూత్ సమహారణః. 65.

ఓం శోణితౌఘా మహానద్యః, సద్యః తత్ర ప్రసుస్రువుః
మధ్యేచాసురసైన్యస్య, వారణాసుర వాజినాం. 66.

ఓం క్షణేన తన్మహాసైన్యం, అసురాణాం తథాంబికా
నిన్యేక్షయం యథావహ్నిః, తృణదారుమహాచయం. 67.

ఓం సచ సింహో మహానాదం, ఉత్సృజన్ ధుతకేసరః
శరీరేభ్యోఽ మరారీణాం, అసూనివ విచిన్వతి. 68.

ఓం దేవ్యాగణైశ్చ తైస్తత్ర, కృతంయుద్ధం తథాసురైః
యథైషాం తుష్టువుర్దేవాః, పుష్పవృష్టిముచోదివి. 69.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
మహిషాసురసైన్య వధోనామ ద్వితీయోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 1. ఏవం 69.
శ్లోకమంత్రాః 68. ఏవమాదితః = 173.

60. సేనలకు ముందు నడచువారు ప్రాణములు కోల్పోయిరి. కొందరి బాహువులు, కంఠములు తెగిపోయెను.

60. కొందరి తలలు, కొందరి నడుములు నరకబడెను. పిక్కలు విరిగి మహాసురులు కొందరు నేలకూలిరి.

62. కొందరు ఒక బాహువు, ఒక కన్ను, ఒక కాలు నిలువుకు నరకబడిరి. కొందరు తలలుతెగి పుడమిపై పడియు మరల లేచిరి.

63. కొన్ని మొండెములు ఆయుధములుధరించి లేచి దేవితో యుద్ధము చేసెను. కొందరు వాద్యముల లయననుసరించి నృత్యముచేసిరి.

64. కొన్ని మొండెములే కత్తులు చేతఁబట్టి దేవితో నిలు నిలుమని కేకలు వేసెను.

65. ఆ యుద్ధభూమి తెగి విరిగి చెడి పడిన చతురంగబలములతో నడుగు పెట్టుటకు వీలులేకుండెను.

66. అసురసేనలోని ఏనుగుల గుఱ్ఱముల రక్కసుల నెత్తురులు మహానదులై ప్రవహించెను.

67. క్షణములో నాదేవి రాక్షససైన్యము నంతటిని అగ్గి కలపను చెత్తను కాల్చునట్లు నాశము చేసెను.

68. దేవియొక్క వాహనసింహము జూలువిదిలించి గర్జించుచు దానవుల శరీరములందు ప్రాణములను వెదకునట్లు సంచరించెను.

69. అచట దేవగణములు రాక్షసులతో యుద్ధముచేయుటచూచి దేవతలు సంతోషించి పుష్పవర్షము కురియించిరి.

ద్వితీయాధ్యాయము.

# తృతీయోఽధ్యాయః

ఓం నమశ్చండికాయై.

ఓం ఋషి రువాచ :— 1.

ఓం నిహన్యమానం తత్సైన్యం, అవలోక్య మహాసురః
సేనానీః చిక్షురః కోపాత్, యయౌయోద్ధు మథాంబికాం. 2.

ఓం సదేవీం శరవర్షేణ, వవర్ష సమరేఽసురః
యథా మేరుగిరేః శృంగం, తోయవర్షేణ తోయదః. 3.

ఓం తస్య చ్ఛిత్వా తతోదేవీ, లీలయైవ శరోత్కరాన్
జఘాన తురగాన్ బాణైః, యంతారం చైవ వాజినాం. 4.

ఓం చిచ్ఛేద చ ధనుః సద్యో, ధ్వజం చాతిసముచ్ఛ్రితం
వివ్యాధ చైవ గాత్రేషు, ఛిన్నధన్వాన మాశుగైః. 5.

ఓం సచ్ఛిన్న ధన్వా విరథో, హతాశ్వో హతసారథిః
అభ్యధావత తాం దేవీం, ఖడ్గచర్మ ధరోఽసురః. 6.

ఓం సింహ మాహత్య ఖడ్గేన. తీక్ష్ణధారేణ మూర్ధని
ఆజఘాన భుజే సవ్యే, దేవీ మప్యతి వేగవాన్. 7.

ఓం తస్యాః ఖడ్గో భుజంప్రాప్య, పఫాల నృపనందన !
తతో జగ్రాహ శూలం స, కోపా దరుణలోచనః 8.

ఓం చిక్షేపచ తతస్తత్తు, భద్రకాళ్యాం మహాసురః
జాజ్వల్యమానం తేజోభిః, రవిబింబ మివాంబరాత్. 9.

ఓం దృష్ట్వా తదాపతచ్ఛూలం, దేవీశూల మముంచత
తేన తత్ శతధా నీతం, శూలం సచ మహాసురః. 10.

# తృతీయాధ్యాయము.

1. ఋషి యిట్లనెను.

2. మహిషుని సేనానాయకుడు చిక్షురుడు చంపబడుచున్న తన సైన్యమును చూచి కోపముతో దేవితో యుద్ధమునకై వెడలెను.

3. వాడు మేరుపర్వతముపై మేఘములు వర్షించునట్లు దేవిపై బాణ వర్షము కురియించెను.

4. దేవి వాని బాణములను విలాసముగా ఖండించి వాని గుఱ్ఱములను సారథిని బాణములతో కొట్టెను.

5. వాని విల్లువిరిచి, ఎత్తైన వాని టెక్కెమును తుక్కుచేసెను. వాని యొడలినిండ ములుకులు కూరెను.

6. వాడు ధనువును, రథసారథులను గోల్పోయి, కత్తికేడెము ధరించి దేవిపై కురికెను.

7. సింహముతలపై ఖడ్గముతో గొట్టి. మహావేగముతో దేవియొక్క ఎడమభుజముపై కొట్టెను.

8. దేవి భుజమునుదాకి వానిఖడ్గమే ముక్కలయ్యెను. అంత చిక్షురుడు కోపమున కనులెఱ్ఱచేసి

9. శూలమునెత్తి భద్రకాళిపై విసరెను. అది ఆకాశమునుండి మండుచు వచ్చు సూర్యబింబమువలె దేవిపైకి వచ్చుచుండెను.

10. దేవియు మీదబడవచ్చు వానిశూలముపై తనశూలమును విడిచెను. దానితో వానిశూలము నూరుముక్కలయ్యెను. వాడును చచ్చెను.

ఓం హతే తస్మిన్ మహావీర్యే, మహిషస్య చమూపతౌ
ఆజగామ గజారూఢః, చామరః త్రిదశార్దనః. 11.

ఓం సోపి శక్తిం ముమోచాథ, దేవ్యా స్తామంబికాద్రుతం
హుంకారాభిహతాంభూమౌ, పాతయామాస నిష్ప్రభాం. 12.

ఓం భగ్నాం శక్తిం నిపతితాం, దృష్ట్వా క్రోధసమన్వితః
చిక్షేప చామర శ్శూలం, బాణైః తదపి సాఽచ్ఛినత్. 13.

ఓం తత స్సింహస్సముత్పత్య, గజకుంభాంతరే స్థితః
బాహుయుద్ధేన యుయుధే, తేనోచ్చైః త్రిదశారిణా. 14.

ఓం యుధ్యమానౌ తతస్తౌతు, తస్మాన్నాగా న్మహీంగతౌ
యుయుధాతేఽతి సంరబ్ధౌ, ప్రహారై రతిదారుణైః. 15.

ఓం తతో వేగాత్ సముత్పత్య, నిపత్యచ మృగారిణా
కరప్రహారేణ శిరః, చామరస్య పృథక్కృతం. 16.

ఓం ఉదగ్రశ్చ రణే దేవ్యా, శిలావృక్షాదిభి ర్హతః
దంతముష్టితలై శ్చైవ, కరాళశ్చ నిపాతితః. 17.

ఓం దేవీ క్రుద్ధాగదాపాతైః, చూర్ణయామాస చోద్ధతం
బాష్కలం భిందిపాలేన. బాణై స్తామ్రం తథాంధకం. 18.

ఓం ఉగ్రాస్య ముగ్రవీర్యంచ, తథైవ చ మహాహనుం
త్రిణేత్రాచ త్రిశూలేన, జఘాన పరమేశ్వరీ. 19.

ఓం బిడాలస్యాసినా కాయాత్, పాతయామాస వై శిరః
దుర్ధరం దుర్ముఖం చోభౌ, శరై ర్నిన్యేయమక్షయం. 20.

ఓం ఏవం సంక్షీయమాణేతు. స్వసైన్యే మహిషాసురః
మాహిషేణ స్వరూపేణ, త్రాసయామాస తాన్ గణాన్. 21.

11. బిడాలుడు చావగా చామరుడు ఏనుగునెక్కి దేవితో పోరవచ్చెను.

12. వాడు శక్త్యాయుధమును దేవిపై వైవగా దేవి తన హుంకారము తోనే దానికాంతిని హరించి భూమిపై పడగొట్టెను.

13. చామరుఁడు శక్తి చెడిపోవుటచూచి క్రోధముతో శూలము విసరెను. దేవి దానిని బాణముతో విరిచెను.

14. అపుడు సింహము చామరుని యేనుగు కుంభస్థలముపై కెగిరి, వానితో బాహుయుద్ధము చేసెను.

15. వారిరువురు యుద్ధముచేయుచునే ఏనుగుమీదినుండి నేలకురికి భీకర ముగా తన్నుకొని పోరిరి.

16. అపుడు సింహము మహావేగముతో పైకెగిరి వానిపైబడి పంజాతో కొట్టి వానితల తుంచివైచెను.

17. దేవి రాలతో చెట్లతో కొట్టి ఉదగ్రుని చంపెను. దంతపుపిడిగల చురకత్తితోడి పిడికిటి యొడుపులతో కరాళుని హతమార్చెను.

18. గదతోడి దెబ్బలతో ఉద్ధతుని పిండిపిండి యొనర్చెను. బాష్కలుని భిందిపాలముతోను, అంధకుని, తామ్రుని బాణములతోను,

19. ఉగాస్యుడు, ఉగ్రవీర్యుడు, మహాహనువు అనువారలను త్రిశూలము తోను చంపెను.

20. బిడాలుని శరీరమునుండి కత్తితో తలను పడనరికెను. దుర్ధరుని దుర్ముఖుని బాణములతో యమునింటికంపెను.

21. మహిషాసురుడు తన బలమిట్లు క్షీణించుచుండగా దున్నరూపముతో ఆ గణములను బెదరించెను.

ఓం కాంశ్చి త్తుండప్రహారేణ, ఖురక్షేపై స్తథాపరాన్
లాంగూలతాడితాన్ చాన్యాన్, శృంగాభ్యాంచ విదారితాన్. 22.

ఓం వేగేన కాంశ్చి దపరాన్, నాదేన భ్రమణేన చ
నిశ్వాసపవనే నాన్యాన్, పాతయామాస భూతలే. 23.

ఓం నిపాత్య ప్రమధానీకం, అభ్యధావత సోఽసురః
సింహం హంతుం మహాదేవ్యాః, కోపం చక్రే తతోంబికా. 24.

ఓం సోపికోపా న్మహావీర్యః, ఖురక్షుణ్ణ మహీతలః
శృంగాభ్యాం పర్వతానుచ్చాన్, చిక్షేపచ ననాదచ. 25.

ఓం వేగభ్రమణ విక్షుణ్ణా, మహీ తస్య వ్యశీర్యత
లాంగూలే నాహతశ్చాబ్ధిః, ప్లావయామాస సర్వతః. 26.

ఓం ధుతశృంగ విభిన్నాశ్చ, ఖండం ఖండం యయుర్ఘనాః
శ్వాసానిలా స్తాః శతశో, నిపేతుః నభసోఽచలాః. 27.

ఓం ఇతి క్రోధ సమాధ్మాత, మాపతంతం మహాసురం
దృష్ట్వా సా చండికా కోపం, తద్వధాయ తదాకరోత్. 28.

ఓం సాక్షిప్త్వా తస్యవై పాశం, తం బబంధ మహాసురం
తత్యాజ మాహిషం రూపం, సోపిబద్ధో మహామృధే. 29.

ఓం తత స్సింహోఽభత్ సద్యో, యావత్తస్యాంబికా శిరః
ఛినత్తి తావత్పురుషః, ఖడ్గపాణి రదృశ్యత. 30.

తత ఏవాశు పురుషం, దేవీ చిచ్ఛేద సాయకైః
తం ఖడ్గచర్మణా సార్థం, తతస్సోభూ న్మహాగజః. 31.

ఓం కరేణ చ మహాసింహం, తం చకర్ష జగర్జ చ
కర్షతస్తు కరందేవీ, ఖడ్గేన నిరకృంతత. 32.

22. కొందరిని ముష్టిచేఁగొట్టి, మరికొందరిని గిట్టలతోమెట్టి, తోకతోచుట్టి కొమ్ము (కోర) లతో గ్రుమ్మి,

23. వేగముతో కొందరిని, ఘుర్ఘురధ్వనితో, సుడితిరుగుడులతో, నిశ్శ్వాస వాయువులతో మరికొందరిని నేలఁబడఁగొట్టెను.

24. ఇట్లు దేవీసేనాగణములఁగూల్చి, దేవియొక్క సింహమును చంపఁ బూని పరుగెత్తెను. దేవి మిక్కిలి రోషము వహించెను.

25. మహావీర్యుడగు వాడుకూడ కోపముతో గిట్టలతోఁధట్టించి భూమినిదున్ని లేపెను. కోఁరకొమ్ములతో నెత్తైనకొండశిఖరములను వ్రాల్చి ఆర్చెను.

26. దాని తిరుగుడువేగముతో భూమి శిథిలమయ్యెను. తోక తాకుడులతో సముద్రమెల్లెడల తడిపెను.

27. దాని కోరపొడుపులకు మేఘములు చిందరవందరయ్యెను. దాని నిట్టూర్పులకు కొండలు దండిగా విరిగిపడెను.

28. ఇట్లు కోపావేశముతో తనపై పడవచ్చువానిని దేవిచూచి చంపుటకై కినుక వహించెను.

29. దేవి వానిపైకి పాశమునువైచి గట్టిగా కట్టివైవగా, వెంటనే వాడు దున్నరూపమును విడిచెను.

30. చిటుకులో వాడు సింహమయ్యెను. అంబిక కత్తినెత్తి దానికుత్తుక కత్తిరించునంతలో వాడు ఖడ్గముదాల్చిన పురుషుఁడుగా మారెను.

31. ఆ పురుషు నాదేవి తటుకున బాణములతో కొట్టెను. వాఁడంత కత్తి కేడెములతోకూడ ఏనుగుగా నయ్యెను.

32. ఆ యేనుగు తొండముతో సింహమునులాగి ఘీంకరించెను. దేవి దాని తుండము నపుడే ఖండించెను.

ఓం తతో మహాసురోభూయో, మాహిషం వపు రాస్థితః
తథైవ క్షోభయామాస, త్రైలోక్యం సచరాచరం. 33.

ఓం తతః క్రుద్ధా జగన్మాతా, చండికా పాన ముత్తమం
పపౌ పునః పునశ్చైవ, జహాస రుణలోచనా. 24.

ఓం ననర్ద చాసుర స్సోపి, బలవీర్య మదోద్ధతః
విషాణాభ్యాంచ చిక్షేప, చండికాం ప్రతిభూధరాన్. 35.

ఓం సాచ తాన్ ప్రహితాన్ తేన, చూర్ణయంతీ శరోత్కరైః
ఉవాచ తం మదోద్ధూత, ముఖరాగా కులాక్షరం. 36.

ఓం దేవ్యువాచ :— 37.

ఓం గర్జ గర్జ క్షణంమూఢ !, మధు యావత్పిబామ్యహం
మయా త్వయి హతేఽత్రైవ, గర్జిష్యం త్యాశుదేవతాః. 38.

ఓం ఋషి రువాచ. 39.

ఓం ఏవ ముక్త్వా సముత్పత్య, సాఽరూఢాతం మహాసురం
పాదే నాక్రమ్య కంఠేచ, శూలేనైవ మతాడయత్. 40.

ఓం తత స్సోపి పదాక్రాంతః, తయా నిజముఖా త్తతః
అర్ధనిష్క్రాంత ఏవాసీత్, దేవ్యా వీర్యేణ సంవృతః 41.

ఓం అర్ధనిష్క్రాంత ఏవాసౌ, యుధ్యమానో మహాసురః
తయా మహాసినా దేవ్యా, శిరః ఛిత్వా నిపాతితః. 42.

ఓం తతో హాహాకృతం సర్వం, దైత్యసైన్యం ననాశ తత్
ప్రహర్షం చ పరం జగ్ముః, సకలా దేవతాగణాః. 43.

ఓం తుష్టువు స్తాం సురాదేవీం, సహదివ్యైః మహర్షిభిః
జగు ర్గంధర్వపతయో, ననృతు శ్చాప్సరోగణాః. 44.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
మహిషాసుర వధోనామ తృతీయోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 3. ఏవం 44.
శ్లోకమంత్రాః 41, ఏవమాదితః 217.

33. వాడంత మరల మహిషమై ముల్లోకములను క్షోభింపఁజేసెను.

34. అంత జగన్మాత మిక్కిలికోపించి ఉత్తమంపు పానము సేవించి జేగురు కన్నులతో వికటముగా నవ్వెను.

35. మహిషుడును బలవీర్యములతో మదించి వెకిలిగానవ్వి, గిట్టలతో కొండలను చండిపై దొరలించెను.

36. ఆమెయు వాడురువ్విన కొండలను బాణములతో పిండియొనర్చి, పానంపుమదముతో తొడిబడునుడులతో వాని కిట్లనియె.

37. దేవి యిట్లనెను.

38. ఓరీ మూర్ఖా! వాగువదరు నీ వాగుడింక క్షణము నేసీమధువు నానునంత సేపేలే. ఆపై త్వరలో నేను నిన్నుచంపగా దేవతలుకేరింతలాడుదురులే.

39. ఋషి యిట్లనెను.

40. దేవి ఇట్లుపలికి చెంగున వానిపై కెగిరి, కాలిక్రింద పడవైచి తొక్కి శూలము గొంతులో కుచ్చెను.

41. మహిషుడు దేవి కాలిక్రిందబడి, ఆమె వీర్యముతోనణగి, తనముఖము నుండి సగము బయటికి నిక్కెను.

42. ఆ నిక్కిన సగము శరీరముతోనే యుద్ధమునకుబూనగా దేవి కత్తితో వానితల నరికెను.

43. అంత రాక్షససైన్యమంతయు హాహాకారములు చేయుచు అక్కడనే పడిచచ్చెను. దేవతాగణములన్నియు మిక్కిలి సంతోషమునొందెను.

44. దేవతలు మహర్షులతోకూడ ఆ దేవిని స్తుతించిరి. గంధర్వులుపాడిరి. అచ్చర లాడిరి.

ఇది తృతీయాధ్యాయము.

# చతుర్థోఽధ్యాయః



ఓం ఋషి రువాచ :— 1.

ఓం శక్రాదయ స్సురగణా నిహతేఽతివీర్యే
తస్మిన్ దురాత్మని సురారిబలేచ దేవ్యా
తాం తుష్టువుః ప్రణతినమ్ర శిరోధరాంసా
వాగ్భిః ప్రహర్ష పులకోద్గమచారుదేహాః. 2.

ఓం దేవ్యా యయా తత మిదంజగ దాత్మశక్త్యా
నిశ్శేషదేవగణశక్తి సమూహమూర్త్యా
తా మంబికా మఖిలదేవ మహర్షిపూజ్యాం
భక్త్యా నతాఃస్మ విదధాతు శుభాని సా నః 3.

ఓం యస్యాః ప్రభావ మతులం భగవా ననంతో
బ్రహ్మా హరశ్చ నహివక్తు మలం బలంచ
సా చండికాఽఖిల జగత్పరిపాలనాయ
నాశాయ చా శుభభయస్య మతిం కరోతు. 4.

ఓం యా శ్రీః స్వయం సుకృతినాం భవనేషు, అలక్ష్మీః
పాపాత్మనాం, కృతధియాం హృదయేషు బుద్ధిః,
శ్రద్ధా సతాం, కులజనప్రభవస్య లజ్జా,
తాం త్వాం నతాఃస్మ, పరిపాలయ దేవి ! విశ్వం. 5.

ఓం కిం వర్ణయామ ? తవరూప మచింత్యమేతత్
కిం చాతివీర్య మసురక్షయకారి భూరి
కిం చాహవేషు చరితాని తవాద్భుతాని
సర్వేషు దే వ్యసురదేవగణాదికేషు. 6.

# చతుర్థాధ్యాయము

1. ఋషి యిట్లనెను.

2. మిక్కిలి దుష్టుడు అతివీర్యుడు నగు మహిషాసురుని, వానిసైన్యమును దేవి చంపగా, ఇంద్రుడు మొదలగు దేవతలు వినయముతో తలలు మూపులువంచి సంతసముతో గగుర్పొడిచిన దేహములతో ఆ దేవిని ఇట్లు స్తుతించిరి.

3. సకలదేవతలయొక్క శక్తిసమూహముతో రూపొందిన ఏ దేవి ఆత్మ శక్తితో నీ జగమంతయు నిండియున్నదో, ఏ దేవి సర్వదేవతలకు మహర్షులకు పూజింపఁదగినదో, ఆ అంబికను మేము భక్తితో నమస్కరించెదము. ఆమె శుభముల ననుగ్రహించుగాక.

4. ఏ దేవియొక్క సాటిలేని ప్రభావమును, బలమును చెప్పుటకు విష్ణువు, బ్రహ్మయు. శివుడుకూడ సమర్థులుకారో, ఆ చండిక అఖిలజగమును పాలించుటకును, అశుభములవలని భయమును పోగొట్టుటకును మదిని తలచుగాక.

5. ఏదేవి పుణ్యవంతులయిండ్లలో సాక్షాత్తు లక్ష్మిగను, పాపాత్ములఇండ్ల యందు అలక్ష్మిగను, తెలివిగలవారిహృదయమందు బుద్ధిగను, మంచి వారియెడల శ్రద్ధగను, సత్కులసంభవులయందు లజ్జగను వెలయు చుండునో అట్టిదేవివైన నీకు మ్రొక్కెదము. ప్రపంచమునురక్షింపుము.

6. ఓ దేవీ ! నీ రూపము సమస్త దేవతలు, రాక్షసులు కూడ ఊహించు టకే వీలుకానిది. నీయొక్క అతివీర్యము రాక్షససంహార మొనరించు నది. నీచరిత్ర యుద్ధములందు ఆశ్చర్యము కలిగించునది. ఇక మే మేమని వర్ణింపఁగలము ?

ఓం హేతు స్సమస్తజగతాం త్రిగుణాపి దోషైః
న జ్ఞాయసే హరిహరాదిభి రప్యపారా
సర్వాశ్రియాఖిల మిదం జగదంశభూతం
అవ్యాకృతాహి పరమా ప్రకృతి స్త్వమాద్యా. 7.

ఓం యస్యాః సమస్త సురతా సముదీరణేన
తృప్తిం ప్రయాంతి సకలేషు మఖేషు దేవి!
స్వాహాసి వై పితృగణస్య చ తృప్తిహేతుః
ఉచ్చార్యసే త్వ మతఏవ జనైః స్వధాచ. 8.

ఓం యా ముక్తిహేతు రవిచింత్యమహావ్రతా త్వం
అభ్యస్యసే సునియతేంద్రియ తత్వసారైః
మోక్షార్థిభి ర్మునిభి రస్తసమస్తదోషైః
విద్యా సి సా భగవతీ పరమా హి దేవీ. 9.

ఓం శబ్దాత్మికా సువిమలర్గ్యజుషాం నిధానం
ఉద్గీథరమ్యపదపారవతాంచ సామ్నాం
దేవి త్రయీ భగవతీ భవభావనాయ
వార్తాసి సర్వజగతాం పరమార్తి హంత్రీ. 10.

ఓం మేధాసి దేవి! విదితాఖిలశాస్త్రసారా
దుర్గాసి దుర్గభవసాగరనౌ రసంగా
శ్రీః కైటభారి హృదయైకకృతాధివాసా
గౌరీ త్వమేవ శశిమౌళి కృతప్రతిష్ఠా. 11.

ఓం ఈషత్సహాస మమలం పరిపూర్ణచంద్ర
బింబానుకారి కనకోత్తమ కాంతికాంతం
అత్యద్భుతం ప్రహృత మాత్తరుషా తథాపి
వక్త్రం విలోక్య సహసా మహిషాసురేణ. 12.

## మహాస్యోక్త యంత్రమ్

<table>
<tr><td colspan="4">గౌర్యాసహ<br>రుద్రాయనమః<br>౭</td><td colspan="4">స్వరియాసహ<br>విరించయేనమః<br>౪</td><td colspan="4">లక్ష్మ్యైసహ<br>హృషీకేశాయనమః<br>౯</td></tr>
<tr><td colspan="4">ఓం ఐం<br>మహాకాళ్యైనమః<br>౧</td><td colspan="4">ఓం హ్రీం<br>మహాలక్ష్మ్యైనమః<br>౨</td><td colspan="4">ఓం క్లీం<br>మహాసరస్వత్యైనమః<br>౩</td></tr>
<tr><td colspan="4">ఓం అష్ట<br>భుజాయైనమః<br>౮</td><td colspan="4">ఓం అష్టాదశ<br>భుజాయైనమః<br>౬</td><td colspan="4">ఓం<br>దశాననాయైనమః<br>౫</td></tr>
<tr><td colspan="3">మహిషాయ<br>నమః<br>౧౦</td><td colspan="3">సింహాయ<br>నమః<br>౧౧</td><td colspan="3">కాలాయ<br>నమః<br>౧౨</td><td colspan="3">మృత్యవే<br>నమః<br>౧౩</td></tr>
</table>

# శ్రీ మహాకాళీ స్తోత్రమ్

శ్లో॥ ఖడ్గం చక్ర గదేషు చాప పరిఘాన్ శూలం భుశుండీం శిరః
శంఖం సందధతీం కరైః, త్రినయనాం సర్వాంగభూషావృతాం
నీలాశ్మద్యుతి మాస్యపాద దశకాం సేవే మహాకాళికాం
యా మస్తౌత్ స్వపితే హరౌ కమలజో హంతుం మధుం కైటభం.

# తాంత్రికం నవార్ణోక్త యంత్రమ్



7. నీవే జగములకెల్ల మూలకారణమవు. (సత్త్వరజస్తమములనెడి) త్రిగుణాత్మికవు. కాని నీయందేదోషము కానరాదు. హరిహరాదులకు నైనను నీవు తెలియరావు. అన్నింటికాధారమైన ఈ ప్రపంచము నీలో ఒక యంశమాత్రమే. వికారములులేని పరమప్రకృతివి నీవె.

8. సమస్త యజ్ఞకర్మములయందు ఏ నామోచ్చారణతో దేవతాగణము తృప్తిచెందునో ఆ స్వాహావు నీవె. పితృతృప్తి కారణమైన స్వధవు కూడ నీవె.

9. దోషములను తొలగించుకొని, ఇంద్రియనిగ్రహము పాటించి మోక్షమునాశించు మునివరులు అభ్యసించునట్టి మహావ్రతరూపము ముక్తికారణము నైన ఆ మహావిద్యవు పరదేవివి నీవె.

10. నీవు శబ్దాత్మికవు. విమలమైన ఋగ్యజుర్వేదములకును, హెచ్చు స్థాయిలో గానముసేయఁబడు రమ్యమైన సామవేదమునకు స్థానమవు. సంసార జ్ఞానమునిచ్చి సమస్త జగములకు బాధనుతీర్చు వార్తవు (వ్యవహారశాస్త్రము) ఇట్లు నీవు త్రయీమూర్తివి.

11. సకలశాస్త్రముల సారము తెలిసిన మేధవు నీవె. దాటరాని సంసార సాగరమునకు నౌకవంటి దుర్గవు నీవె. విష్ణుమూర్తి హృదయవాసి నివి లక్ష్మివి నీవె. చంద్రశేఖరునితో నతుకబడిన గౌరివియు నీవె.

12. చిఱునగవులు చిందుచు వందమై నిండు చందురునిబోలు బంగరు రంగుల తురంగలించు నీ ముఖమును చూచి, చూచి ఆ దున్నపోతు రక్కసు డేతీరునఁ గొట్టగలిగెనో యచ్చెరువవగుచున్నది.

ఓం దృష్ట్వాతు దేవి ! కుపితం భ్రుకుటీకరాళం
ఉద్య చ్ఛశాంకసదృశచ్ఛవి య న్నసద్యః
ప్రాణాన్ ము మోచ మహిషః తదతీవచిత్రం
కైర్జీవ్యతేహి కుపితాంతకదర్శనేన ? 13.

ఓం దేవి । ప్రసీద పరమా భవతీ భవాయ
సద్యో వినాశయసి కోపవతీ కులాని
విజ్ఞాత మేత దధునైవ యదస్తమేత
న్నీతం బలం సువిపులం మహిషాసురస్య. 14.

ఓం తే సమ్మతా జనపదేషు, ధనాని తేషాం,
తేషాం యశాంసి, నచ సీదతి ధర్మవర్గః
ధన్యాః తఏవ నిభృతాత్మజ పుత్రదారా
యేషాం సదాభ్యుదయదా భవతీ ప్రసన్నా. 15.

ఓం ధర్మ్యాణి దేవి ! సకలాని సదైవ కర్మా
ణ్యత్యాదృతః ప్రతిదినం సుకృతీకరోతి
స్వర్గం ప్రయాతి చ తతో భవతీ ప్రసాదాత్
లోకత్రయేపి ఫలదా నను దేవి తేన. 16.

ఓం దుర్గే స్మృతా హరసి భీతి మశేషజంతోః
స్వస్థైః స్మృతా మతి మతీవ శుభాం దదాసి
దారిద్ర్యదుఃఖభయహారిణి కా త్వదన్యా ?
సర్వోపకారకరణాయ సదార్ద్ర చిత్తా. 17.

ఓం ఏభి ర్హతై ః జగ దుపైతి సుఖం, తథైతే
కుర్వంతు నామ నరకాయ చిరాయ పాపం
సంగ్రామమృత్యు మధిగమ్య దివం ప్రయాంతు
మత్వేతి నూన మహితా న్వివి హంసి దేవి ! 18.

13. దేవి ! కోపముతో కనుబొమలు ముడిపడి, భయంకరమై ఉదయించు చున్న చంద్రునివలె ఎఱ్ఱనైన నీ ముఖము చూచినంతనే ఆ మహిషుడు ప్రాణము విడువవలసినది. అట్లు విడువకుండుటయే చిత్రము. కోపించిన యమునిగాంచి ఎవరు బ్రతుకఁగలరు ?

14. దేవి ! అనుగ్రహింపుము. నీవు తృప్తినొందినచో సంపదలిత్తువు. కోపము బూనినచో సర్వనాశము చేయుదువు. ఈ విషయము నిపుడే మహిషాసురుని సర్వసైన్యమును నాశము చేయుటవలన తెలియ నయ్యెను.

15. ఎల్లప్పుడును శుభములిచ్చు నీవు ఎవరిని కరుణింతువో వారే దేశము నందు గౌరవనీయులు. వారికే ధనము కలుగును, యశమబ్బును. ఆలుబిడ్డలు సేవకులతో సుఖములనందుచు వారే ధన్యులగుదురు.

16. దేవి ! నీవు దయతో నెవరి నాదరింతువో వారు నిత్యము సకలధర్మ కర్మములు చేయఁగలుగుదురు. ఆపై స్వర్గమునకు చేరుదురు. కనుక ముల్లోకములందలి ఫలముల నొసంగుదానవు నీవే సుమా !

17. సంకటములనుండి నిన్నుతలచిన నెల్లవారికిని భీతిని పోగొట్టుదువు. స్వస్థులుగానుండి తలచిన మిక్కిలి మంచిబుద్ధి నిత్తువు. నీవు ఎట్టి వారికైనను ఉపకారముచేయుటకు జాలిమనసు కలిగియుందువు. దారిద్ర్యము, దుఃఖమును, భయమును పోగొట్టుటకు నీకంటెవేరెవరున్నారు?

18. నీవు వీరందరిని చంపుటవలన ప్రపంచమునకు సుఖమే కలిగినది. వీరందరు మొదటినుండి నరకమునకు పోవలసిన పాపములనే చేసినారు. అయినను వారు యుద్ధమరణమువలన స్వర్గ (పుణ్య) లోకములకు పోదురుగాక అనితలచి నీవు వారిని చంపితివి.

ఓం దృష్ట్వైవ కిం న భవతీ ప్రకరోతిభస్మ ?
సర్వాసురాన్ ? అరిషు యత్ప్రహిణోషి శస్త్రం
లోకాన్ ప్రయాంతు రిపవోపిహి శస్త్రపూతా
ఇత్థం మతి ర్భవతి తే ష్వఖిలేషు సాధ్వీ ! 19.

ఓం ఖడ్గప్రభానికర విస్ఫురణై ః తధోగ్రైః
శూలాగ్రకాంతినివహేన దృశోసురాణాం
య న్నాగతా విలయ మంశుమదిందుఖండ
యోగ్యాననం తవ విలోకయతాం తదేతత్. 20.

ఓం దుర్వృత్త వృత్తశమనం తవ దేవి ! శీలం
రూపం తథైత దవిచింత్య మతుల్య మన్యైః
వీర్యం చ హంతృ హృతదేవ పరాక్రమాణాం
వైరిష్వపి ప్రకటి తైవ దయా త్వయేత్థం. 21.

ఓం కేనోపమా భవతు తేఽస్య పరాక్రమస్య ?
రూపం చ శత్రుభయకా ర్యతిహారి కుత్ర ?
చిత్తే కృపా పరమనిష్ఠురతాచ దృష్టా
త్వ య్యేవ దేవి ? వరదే ! భువనత్రయేపి. 22.

ఓం త్రైలోక్య మేత దఖిలం రిపునాశనేన
త్రాతం త్వయా సమరమూర్ధని, తేఽపి హత్వా
నీతా దివం రిపుగణా, భయ మప్యపాస్తం
అస్మాక మున్మదసురారిభవం నమస్తే. 23.

ఓం శూలేన పాహినో దేవి ! పాహి ఖడ్గేన చాంబికే !
ఘంటాస్వనేన నః పాహి, చాపజ్యా నిస్వనేన చ. 24.

ఓం ప్రాచ్యాం రక్ష, ప్రతీచ్యాంచ, చండికే రక్ష దక్షిణే
భ్రామణే నాత్మశూలస్య, ఉత్తరస్యాం తథేశ్వరి ! 25.

19. ఈ రక్కసుల నందరిని నీవు చూపులతోనే భస్మము చేయలేవా ఏమి ? మరి వారిపై శస్త్రప్రయోగము నేలచేసితి వనగా శస్త్రములతో వారును పవిత్రులై పుణ్యలోకమ్ములకు పోనిమ్మనియేకదా. ఇట్లు శత్రువులపై గూడ నీమనసు ఉదారమైనది.

20. భయంకరమైన నీ ఖడ్గమునుండి వెలువడు వేడికాంతులకును, శూలపు వాడివెలుగులకును శత్రువుల కన్నులు పాడై పోకుండుటకు వెన్నెలల విరజిమ్ము నీ ముఖచంద్రుని దర్శనమే కారణము.

21. దేవీ ! నీ శీలము దుష్టుల దుశ్చేష్టల నణచుటకు మూలము. సాటిలేని నీ రూపము తలంచుటకునైన నోపము. దేవతల పరాక్రమము నణచినవారి (రాక్షసులను) నణచివేసిన నీ వీర్య మవార్యము. పగవారిపై కూడ ప్రకటించిన నీ యక్కటికము (దయ) మిక్కుటము.

22. నీ పరాక్రమము పోలికలేనిది, శత్రువులకు భయముకలిగించు నీ రూపము మరెక్కడకూడ లేదు. మనసులో కనికరము, కఱకుదనము మూడులోకములలో నీయందుమాత్రమే కనిపించుచున్నది.

23. యుద్ధమునందు శత్రువుల నందరిని చంపి ముల్లోకములను రక్షించితివి. శత్రువులనుకూడ స్వర్గమునకు పంపితివి. పొగరుబోతులైన రక్కసులవలని భయము మాకు లేకుండఁజేసితివి. నీకు మా నమస్కారము.

24. దేవీ ! నీ శూలముతో మమ్ము కాపాడుము. ఖడ్గముతోను, ఘంటాధ్వనితోను, వింటినారి చప్పుడుతోను రక్షింపుము.

25. చండికా ! నీ శూలభ్రమణములతో తూర్పు పడమరలను, ఉత్తర దక్షిణములందును మమ్మేలుము.

ఓం సౌమ్యాని యాని రూపాణి, త్రైలోక్యే విచరంతితే
యాని చాత్యంత ఘోరాణి, తై రక్షాస్మాన్ తథాభువం. 26.

ఓం ఖడ్గశూలగదాదీని, యానిచాస్త్రాణి తేఽంబికే
కరపల్లవసంగీని, తై రస్మాన్ రక్ష సర్వతః. 27.

ఓం ఋషి రువాచ :— 28.

ఓం ఏవం **స్తుతా** సురై ః దివ్యైః, కుసుమైః నందనోద్భవై ః
అర్చితా జగతాం ధాత్రీ, తథా గంధానులేపనై ః. 29.

ఓం భక్త్యా సమస్తైః త్రిదశై ః, దివ్యైః ధూపై ః సుధూపితా
ప్రాహ ప్రసాదసుముఖీ, సమస్తాన్ ప్రణతాన్ సురాన్. 30.

ఓం దేవ్యువాచ :— 31.

ఓం వ్రియతాం త్రిదశాస్సర్వే, యదస్మత్తో భివాంఛితం. 32.

ఓం దేవా ఊచుః :— 33.

ఓం భగవత్యా కృతం సర్వం, న కించి దవశిష్యతే
య దయం నిహతః శత్రుః, అస్మాకం మహిషాసురః. 34.

ఓం యదిచాపి వరోదేయః, త్వయాఽస్మాకం మహేశ్వరి :
సంస్మృతా సంస్మృతాత్వంనో, హింసేథాః పరమాపదః. 35.

ఓం యశ్చ మర్త్యః స్తవై రేభిః, త్వాం స్తోష్యత్యమలాననే. 36.

ఓం తస్య విత్తర్ధి విభవై ః, ధనదారాదిసంపదాం
వృద్ధయేఽస్మత్ప్రసన్నాత్వం, భవేథాః సర్వదాంబికే. 37.

ఓం ఋషి రువాచ :— 38.

ఓం ఇతి ప్రసాదితా దేవై ః, జగతోఽర్థే తథాఽత్మనః
తథేత్యుక్త్వా భద్రకాళీ, బభూవాంతర్హితా నృప. 39.

26. మూడులోకములందును సంచరించుచున్న నీ సౌమ్యరూపములతోను, మిక్కిలి ఘోరరూపములతోను మమ్మును ప్రపంచమును పాలింపుము.

27. అమ్మా ! చిగురాకువంటి నీ హస్తమునంటిన ఖడ్గము, శూలము, గద మొదలగుఅస్త్రములతో మమ్ము అన్ని వేళల అన్నింటినుండికాపాడుము.

28. ఋషి యిట్లనెను.

29. దేవత లాదేవినిట్లు స్తుతించి, నందనవనమునందలి దివ్యకుసుమముల తోను, గంధపు పూతలతోను పూజించిరి.

30. ధూపములు సమర్పించి నమస్కరించిరి. ఆ దేవి ప్రసన్నముఖియై దేవతలతో ఇట్లనెను.

31 దేవి యిట్లనెను,

32. దేవతలారా ! మీరందరు నావలన నేమికావలయునో కోరుకొనుడు.

33. దేవత లిట్లనిరి.

34. భగవతీ ! మాశత్రువగు మహిషాసురుని సంహరించుటచే మాకు కావలసినదంతయు నొనరించితివి. ఏమియు కొరత పెట్టలేదు.

35. తల్లీ ! మరేదైనవరము మాకీయఁదలచినచో మేము నిన్ను తలచినపు డెల్ల మా యాపదల బాపుము.

36. ఏమనుష్యుడు నిన్నీస్తోత్రములతో పొగడునో వానికి ధనము, వృద్ధి, భార్య మొదలగు సంపదలును.

37. వృద్ధిచెందునట్లు మాకోరికపై చేయుము.

38. ఋషి యిట్లనెను.

39. తమకొఱకును, జగములకొఱకును దేవతలచే నిట్లు పొగడబడిన దేవి 'అట్లే' అని పలికి అంతర్ధానమొందెను.

ఓం ఇత్యేతత్ కథితం భూప!, సంభూతా సా యథాపురా
దేవీ దేవశరీరేభ్యో, జగత్త్రియ హితైషిణీ. 40.

ఓం పునశ్చ గౌరీ దేహాత్సా, సముద్భూతా యథాఽభవత్
వధాయ దుష్టదైత్యానాం, తథా శుంభనిశుంభయోః. 41.

ఓం రక్షణాయచ లోకానాం, దేవానా ముపకారిణీ
తత్ శృణుష్వ మయాఖ్యాతం, యథావత్ కథయామితే. 42.
హ్రీం ఓం

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
శక్రాదిస్తుతిర్నామ చతుర్థోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 5. ఏవం 42
అర్ధమంత్రాః 2. ఏవమాదితః 259
శ్లోకమంత్రాః 35.

40. రాజా ! దేవతల శరీరమునుండి ముల్లోకములకు హితమునుకోరు ఆ దేవి పుట్టినవిధమును ఇట్లు నీకు తెలిపితిని.

41. మరల నాదేవి దుష్టసంహారము కొఱకును, శుంభనిశుంభుల వధించుటకును.

42. లోకములను రక్షించుటకును గౌరీశరీరమునుండి పుట్టినకధను తెలుపుదును వినుము.

## చతుర్ధాధ్యాయము.

# ఉత్తమ చరిత్రమ్

## పంచమో౽ధ్యాయః

అస్యశ్రీ ఉత్తమచరిత్రస్య రుద్రఋషిః - అనుష్టుప్ఛందః - శ్రీమహా సరస్వతీ దేవతా - భీమా శక్తిః - భ్రామరీ బీజం - సూర్యస్తత్వం - సామ వేదః స్వరూపం - మహాసరస్వతీప్రీత్యర్థే, కామార్థే జపే వినియోగః.

రుద్రఋషయేనమః శిరసి - అనుష్టుప్ ఛందసేనమః ముఖే - మహా సరస్వతీ దేవతాయై నమః హృదయే - భీమాశక్త్యే నమః దక్షిణస్తనే - భ్రామరీబీజాయనమః వామస్తనే - సూర్యతత్వాయనమః నాభౌ - న్యసేత్.

ధ్యానం :—

ఘంటాశూలహలాని శంఖముసలే చక్రం ధనుస్సాయకాన్
హస్తాబ్జైః దధతీం, ఘనాంతవిలసత్ శీతాంశుతుల్యప్రభాం
గౌరీదేహసముద్భవాం త్రిజగతా మాధారభూతాం మహా
పూర్వామత్ర సరస్వతీ మనుభజే శుంభాదిదైత్యార్దినీం.

ఓం నమశ్చండికాయై.

ఓం క్లీం ఋషి రువాచ :— 1.

ఓం పురా శుంభనిశుంభాభ్యాం, అసురాభ్యాం శచీపతేః
త్రైలోక్యం యజ్ఞభాగాశ్చ, హృతా మదబలాశ్రియాత్. 2.

ఓం తా వేవ సూర్యతాం తద్వత్, అధికారం తథైందవం
కౌబేర మథ యామ్యంచ, చక్రాతే వరుణస్య చ. 3.

ఓం తా వేవ పవనర్ధించ, చక్రతుః వహ్నికర్మచ
తతో దేవా వినిర్ధూతాః, భ్రష్టరాజ్యాః పరాజితాః. 4.

# పంచమాధ్యాయము.

1. ఋషి యిట్లనెను.

2 పూర్వము శుంభుఁడు, నిశుంభుఁడు అనురాక్షసులు బలముతోడి గర్వముతో ఇంద్రునియొక్క త్రిలోకాధిపత్యమును యజ్ఞభాగములను హరించిరి.

3. సూర్య, చంద్ర, కుబేర, యమ, వరుణులయొక్క అధికారములను గూడ వారే వహించిరి.

4. వాయువు అగ్నులయొక్క వ్యాపారములను లాగికొనిరి. దేవతలు రాజటికమును గోల్పోయి ఓటుపడిరి.

ఓం హృతాధికారాః త్రిదశాః, తాభ్యాం సర్వే నిరాకృతాః
మహాసురాభ్యాం తాం దేవీం, సంస్మరం త్యపరాజితాం. 5.

ఓం తయాఽస్మాకం వరోదత్తో, యథాఽపత్సు స్మృతాఽఖిలాః
భవతాం నాశయిష్యామి, తత్‌క్షణాత్ పరమాపదః. 6.

ఓం ఇతి కృత్వా మతిం దేవా, హిమవంతం నగేశ్వరం
జగ్ముః తత్రి తతో దేవీం, విష్ణుమాయాం ప్రితుష్టువుః. 7.

ఓం దేవా ఊచుః :— 8.

ఓం నమో దేవ్యై మహాదేవ్యై, శివాయై సతతం నమః
నమః ప్రికృత్యై భద్రాయై, నియతాః ప్రిణతాఃస్మతాం. 9.

ఓం రౌద్రాయై నమో నిత్యాయై, గౌర్యై ధాత్ర్యై నమోనమః
జ్యోత్స్నాయై చేందురూపిణ్యై, సుఖాయై సతతం నమః. 10.

ఓం కల్యాణ్యై ప్రిణతాం వృద్ధ్యై, సిద్ధ్యై కూర్మ్యై నమోనమః
నైరృత్యై భూభృతాం లక్ష్మ్యై, శర్వాణ్యైతే నమోనమః 11.

ఓం దుర్గాయై దుర్గపారాయై, సారాయై సర్వకారిణ్యై
ఖ్యాత్యై తథైవ కృష్ణాయై, ధూమ్రాయై సతతం నమః. 12.

ఓం అతిసౌమ్యాతి రౌద్రాయై, నతాస్తస్యై నమోనమః
నమోజగత్ప్రతిష్ఠాయై, దేవ్యై కృత్యై నమోనమః. 13.

ఓం యా దేవీ సర్వభూతేషు, విష్ణుమాయేతి శబ్దితా
నమస్తస్యై. 14.

ఓం నమస్తస్యై. 15.

ఓం నమస్తస్యై నమోనమః. 16.

5. శుంభ నిశుంభులవలన తరుమబడిన దేవతలు పరాజయమెఱుగని దేవిని తలచుకొనిరి.

6. 'ఆపదవేళల నన్ను తలచినంత మీ బాధలను తీర్చెదను' అని ఆమె మాకు వరమిచ్చెనుగదా.

7. అని మదిదలచి దేవతలు హిమవత్పర్వతమునుజేరి విష్ణుమాయాదేవిని స్తుతు లొనరించిరి.

8. దేవత లిట్లనిరి.

9. దేవి, మహాదేవి, మంగళస్వరూప అగు శక్తికి నమస్కారము. జగత్తునకు మూలకారణమగు భద్రకు నియతితో నమస్కరింతుము.

10. రౌద్ర, నిత్య, గౌరి, ధాత్రి, చంద్రిక, చంద్రరూప, సుఖమయి అగు దేవికి నమస్కారము.

11. కల్యాణికి, సేవించువారిపాలి అభ్యుదయమునకు. సిద్ధికి, కూర్మరూపిణికి, అలక్ష్మికిని, రాజులపాలి లక్ష్మికి శర్వాణికి నతులు.

12. కష్టములతరింపఁజేయు దుర్గకును, సర్వమునకు కారణభూతమైన సారస్వరూపకును. ఖ్యాతి, కృష్ణ, ధూమ్ర అనుపేర్లనొప్పు దేవికినమస్సులు.

13. మిక్కిలి సౌమ్యము, మిక్కిలి కూరము నగు దేవికిని, జగత్తు యొక్క స్థితిరూపయగు శక్తికి నతులు.

14.
15. అన్ని భూతములందు విష్ణుమాయగా చెప్పబడు దేవికి ముమ్మారు నమస్కారము.
16.

ఓం యా దేవీ సర్వభూతేషు, చేతనేత్యభిధీయతే. నమస్తస్యై. 17.
ఓం నమస్తస్యై. 18. ఓం నమస్తస్యై నమోనమః. 19.

ఓం యా దేవీ సర్వభూతేషు, బుద్ధిరూపేణ సంస్థితా. నమస్తస్యై. 20.
ఓం నమస్తస్యై. 21. ఓం నమస్తస్యై నమోనమః. 22.

ఓం యా దేవీ సర్వభూతేషు, నిద్రారూపేణ సంస్థితా. నమస్తస్యై. 23.
ఓం నమస్తస్యై. 24. ఓం నమస్తస్యై నమోనమః. 25.

ఓం యా దేవీ సర్వభూతేషు, క్షుధారూపేణ సంస్థితా. నమస్తస్యై. 26.
ఓం నమస్తస్యై. 27. ఓం నమస్తస్యై నమోనమః. 28.

ఓం యా దేవీ సర్వభూతేషు, ఛాయారూపేణ సంస్థితా. నమస్తస్యై 29.
ఓం నమస్తస్యై. 30. ఓం నమస్తస్యై నమోనమః. 31.

ఓం యా దేవీ సర్వభూతేషు, శక్తిరూపేణ సంస్థితా. నమస్తస్యై. 32.
ఓం నమస్తస్యై. 33. ఓం నమస్తస్యై నమోనమః. 34.

ఓం యా దేవీ సర్వభూతేషు, తృష్ణారూపేణ సంస్థితా. నమస్తస్యై 35.
ఓం నమస్తస్యై 36. ఓం నమస్తస్యై నమోనమః. 37.

ఓం యా దేవీ సర్వభూతేషు, క్షాంతిరూపేణ సంస్థితా. నమస్తస్యై 38.
ఓం నమస్తస్యై 39. ఓం నమస్తస్యై నమోనమః. 40.

ఓం యా దేవీ సర్వభూతేషు, జాతిరూపేణ సంస్థితా. నమస్తస్యై 41.
ఓం నమస్తస్యై 42. ఓం నమస్తస్యై నమోనమః. 43.

ఓం యా దేవీ సర్వభూతేషు, లజ్జారూపేణ సంస్థితా. నమస్తస్యై 44.
ఓం నమస్తస్యై 45. ఓం నమస్తస్యై నమోనమః. 46.

ఓం యా దేవీ సర్వభూతేషు, శాంతిరూపేణ సంస్థితా. నమస్తస్యై 47.
ఓం నమస్తస్యై 48. ఓం నమస్తస్యై నమోనమః. 49.

17, 18, 19. అన్ని భూతములందు చేతన యనబడు దేవికి నమస్కారములు.

20, 21, 22. భూతము లన్నింటియందు బుద్ధిరూపముతో నుండు దేవికి నమస్కారములు.

23, 24, 25. భూతము లన్నిటియందు నిద్రారూపముననుండు దేవికి నమస్కారములు.

26, 27, 28. భూతము లన్నిటియందు క్షుత్తు (ఆకలి) రూపముతోనుండు దేవికి నమస్కారములు.

29, 30, 31. భూతము లన్నిటియందు ఛాయా (ప్రతిబింబ) రూపముతో నుండు దేవికి నమస్కారములు.

32, 33, 34. భూతము లన్నిటియందు శక్తిరూపముతో నుండు దేవికి నమస్కారములు.

35, 36, 37. భూతము లన్నిటియందు తృష్ణా (దప్పి) రూపముతో నుండు దేవికి నమస్కారములు.

38, 39, 40. భూతము లన్నిటియందు క్షాంతి (ఓర్పు) రూపముతో నుండు దేసికి నమస్కారములు.

41, 42, 43. భూతము లన్నిటియందు జాతిరూపముతోనుండు దేవికి నమస్కారములు.

44, 45, 46. భూతములన్నిటియందు లజ్జారూపముతో నుండు దేవికి నమస్కారములు.

47, 48, 49. భూతము లన్నిటియందు శాంతిరూపముతో నుండు దేవికి నమస్కారములు.

ఓం యా దేవీ సర్వభూతేషు, శ్రద్ధారూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 50.
ఓం నమస్తస్త్యై 51. ఓం నమస్తస్త్యై నమోనమః. 52.

ఓం యా దేవీ సర్వభూతేషు, కాంతిరూపేణ సంస్థితా. నమస్తస్త్యై 53.
ఓం నమస్తస్త్యై 54. ఓం నమస్తస్త్యై నమోనమః. 55.

ఓం యా దేవీ సర్వభూతేషు, లక్ష్మీరూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 56.
ఓం నమస్తస్త్యై 57. ఓం నమస్తస్త్యై నమోనమః. 58.

ఓం యా దేవీ సర్వభూతేషు, వృత్తిరూపేణ సంస్థితా. నమస్తస్త్యై 59.
ఓం నమస్తస్త్యై 60. ఓం నమస్తస్త్యై నమోనమః. 61.

ఓం యా దేవీ సర్వభూతేషు, స్మృతిరూపేణ సంస్థితా. నమస్తస్త్యై 62.
ఓం నమస్తస్త్యై 63. ఓం నమస్తస్త్యై నమోనమః. 64.

ఓం యా దేవీ సర్వభూతేషు, దయారూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 65.
ఓం నమస్తస్త్యై 66. ఓం నమస్తస్త్యై నమోనమః. 67.

ఓం యా దేవీ సర్వభూతేషు, తుష్టిరూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 68.
ఓం నమస్తస్త్యై 69. ఓం నమస్తస్త్యై నమోనమః. 70.

ఓం యా దేవీ సర్వభూతేషు, మాతృరూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 71.
ఓం నమస్తస్త్యై 72. ఓం నమస్తస్త్యై నమోదమః. 73.

ఓం యా దేవీ సర్వభూతేషు, భ్రాంతిరూపేణ సంస్థితా. నమస్తస్త్యై. 74.
ఓం నమస్తస్త్యై 75. ఓం నమస్తస్త్యై నమోనమః. 76.

ఓం ఇంద్రియాణా మధిష్ఠాత్రీ, భూతానాం చాఖిలేషుయా.
భూతేషు సతతం తస్త్యై, వ్యాప్త్యై దేవ్త్యై నమోనమః. 77.

ఓం చితిరూపేణ యాకృత్స్న, మేత ద్వ్యాప్యస్థితాజగత్. నమస్తస్త్యై 79.
ఓం నమస్తస్త్యై 79. ఓం నమస్తస్త్యై నమోనమః. 80.

50, 51, 52. భూతము లన్నిటియందును శ్రిద్ధారూపముతో నుండు దేవికి నమస్కారములు.

53, 54, 55. భూతము లన్నిటియందు కాంతి రూపముతోనుండు దేవికి నమస్కారములు.

56, 57, 58. భూతము లన్నిటియందును లక్ష్మి రూపముతోనుండు దేవికి నమస్కారములు.

59, 60, 61. అన్ని భూతములందు వృత్తిరూపముతో నుండు దేవికి నమస్కారములు.

62, 63, 64. భూతములన్నిటియందు స్మృతి రూపముతోనుండు దేవికి నమస్కారములు.

65, 66, 67. భూతము లన్నిటియందు దయారూపముతో నున్న దేవికి నమస్కారములు.

68, 69, 70. భూతము లన్నిటియందు తుష్టిరూపముతోనున్న దేవికి నమస్కారములు.

71, 72, 73. భూతము లన్నిటియందు మాతృ రూపముతోనున్న దేవికి నమస్కారములు.

74, 75, 76. భూతము లన్నిటియందును భ్రాంతి రూపముతోనున్న దేవికి నమస్కారములు.

77. పృథివ్యాది సమస్త భూతములందు ఇంద్రియములకు ఆధారశక్తియై, సర్వప్రాణులందు వ్యాపించియుండు దేవికి నమస్కారము.

78, 79, 80. చిత్ (జ్ఞాన) రూపముతో సమస్తజగమును పూర్తిగా వ్యాపించియుండు దేవికి నమస్కారములు.

ఓం స్తుతా సురైః పూర్వ మభీష్ట సంశ్రియాత్
తథాసురేంద్రేణ దినేషు సేవితా
కరోతు సానః శుభహేతు రీశ్వరీ
శుభాని భద్రాణ్యభిహంతు చాపదః. 81.

ఓం యా సాంప్రతం చోద్ధతదైత్యతాపితైః
అస్మాభి రీశాచ సురైః నమస్యతే
యాచ స్మృతా తత్క్షణ మేవ హంతినః
సర్వాపదో భక్తివినమ్ర మూర్తిభిః. 82.

ఓం ఋషి రువాచ :— 83.

ఓం ఏవం స్తవాది యుక్తానాం, దేవానాం తత్ర పార్వతీ
స్నాతు మభ్యాయయౌ తోయే, జాహ్నవ్యా నృపనందన ః 84.

ఓం సాఽబ్రవీత్ తాన్ సురాన్ సుభ్రూః, భవద్భిః స్తూయతేఽత్రకా ః
శరీర కోశత శ్చాస్యాః సముద్భూతాఽబ్రవీత్ శివా. 85.

ఓం స్తోత్రం మమైతత్ క్రియతే, శుంభదైత్య నిరాకృతైః
దేవైః స్సమేతైః సమరే, నిశుంభేన పరాజితైః. 86.

ఓం శరీరకోశాత్ యత్తస్యాః, పార్వత్యా నిస్సృతాంబికా
కాశికీతి సమస్తేషు, తతో లోకేషు గీయతే. 87.

ఓం తస్యాం వినిర్గతాయాంతు, కృష్ణాఽభూత్ సాపిపార్వతీ
కాళికేతి సమాఖ్యాతా, హిమాచల కృతాశ్రయా. 88.

ఓం తతోఽంబికాం పరంరూపం, బిభ్రాణాం సుమనోహరం
దదర్శ చండో ముండశ్చ, భృత్యౌ శుంభనిశుంభయోః. 89.

ఓం తాభ్యాం శుభాయచాఖ్యాతా, సాతీవసుమనోహరా
కాప్యాస్తే స్త్రీ మహారాజ ః భాసయంతీ హిమాచలం. 90.

81. పూర్వము దేవతలు తమకోరిక తీరిచినందులకు ఏ దేవిని స్తుతిచేసిరో, ఏ దేవి ఇంద్రునిచే నిత్యము సేవింపబడుచుండునో ఆ శుభహేతువైన ఈశ్వరి మాకు శుభములు, భద్రములు నిచ్చుగాక. ఆపదలను బాపుగాక.

82. ప్రకృతము మదించిన శత్రువులతో బాధపడుచున్న మేము వినయముతో నమస్కరించుచున్నాము. తలచినంత మాత్రమున ఆ దేవి మాయొక్క ఆపదల నన్నింటిని పోగొట్టుగాక.

83. ఋషి యిట్లను.

84. దేవత లీతీరున స్తోత్రములు సలుపుచుండగా పార్వతీదేవి గంగాజలములో స్నానమొనరించుటకై పోవుచు నచటికి వచ్చెను.

85. ఆమె దేవతలతో 'మీరు ఇచట ఎవరినిగూర్చి స్తోత్రము చేయుచుంటి' రని యడిగెను. పార్వతి శరీరకోశముమండి ఉద్భవించిన ఒక శుభమూర్తి పార్వతిప్రశ్న కిట్లు బదులుపల్కెను.

86. శుంభ నిశుంభులతో ఓడి తరుమబడిన దేవతలు ఇచటికివచ్చి నన్నే యిట్లు స్తోత్రము చేసిరి.

87. పార్వతి శరీరకోశమునుండి బయలువెడలిన ఆ శుభమూర్తిని కౌశికి యని లోకము కీర్తించెను.

88. పార్వతి శరీరకోశమునుండి కౌశికి వెలువడుటవలన ఆ పార్వతి కృష్ణవర్ణయై కాళిక యనుపేరుతో హిమాచలమున నివసించుచుండెను.

89. తరువాత అతిసుందర మనోహర రూపమును ధరించిన ఆ కౌశికిని శుంభ నిశుంభుల భృత్యులు చండముండులనువారు చూచిరి.

90. వారు పోయి తమరాజు శుంభునితో నిట్లుచెప్పిరి. మహారాజా ! అతి రూపవతియగు నొకఆడుది హిమాలయమునకు వెలుగుకూర్చుచున్నది.

ఓం నైవ తాదృక్ క్వచి ద్రూపం, దృష్టం కేనచి దుత్తమం
జ్ఞాయతాం కాప్యసౌదేవీ, గృహ్యతాం చాఽసురేశ్వర ! 91.

ఓం స్త్రీరత్న మతిచార్వంగీ, ద్యోతయంతీ దిశః త్విషా
సాతు తిష్ఠతి దైత్యేంద్ర ?, తాం భవాన్ ద్రష్టు మర్హతి. 92.

ఓం యాని రత్నాని మణయో, గజాశ్వాదీని వై ప్రభో !
త్రైలోక్యేతు సమస్తాని, సాంప్రతం భాంతి తే గృహే. 93.

ఓం ఐరావత స్సమానీతో, గజరత్నం పురందరాత్
పారిజాత తరుశ్చాయం, తథై వోచ్చై శ్రవాహయః. 94.

ఓం విమానం హంససంయుక్తం, ఏతత్ తిష్ఠతితేఽంగణే
రత్నభూతమిహానీతం, య దాసీత్ వేధసోఽద్భుతం. 95.

ఓం నిధి రేష మహాపద్మః, సమానీతో ధనేశ్వరాత్
కింజల్కినీం దదౌ చాబ్ధిః, మాలా మమ్లానపంకజాం. 96.

ఓం ఛత్రం తే వారుణంగేహే, కాంచనస్రావి తిష్ఠతి
తథాఽయం స్యందనవరో, యఃపురాసీత్ ప్రజాపతేః. 97.

ఓం మృత్యోః ఉత్క్రాంతిదా నామ, శక్తిః ఈశ ! త్వయా హృతా
పాశః సలిలరాజస్య, భ్రాతు స్తవ పరిగ్రహే. 98.

ఓం నిశుంభ స్యాబ్ధిజాతాశ్చ, సమస్తా రత్నజాతయః
వహ్ని శ్చాపి దదౌతుభ్యం. అగ్నిశౌచే చ వాససీ. 99.

ఓం ఏవం దైత్యేంద్ర ! రత్నాని, సమస్తా న్యాహృతాని తే
స్త్రీరత్న మేషా కల్యాణీ, త్వయా కస్మా న్నగృహ్యతే ? 100.

ఓం ఋషి రువాచ :— 101.

ఓం నిశ మ్యేతి వచః శుంభః, స తదా చండముండయోః
ప్రేషయామాస సుగ్రీవం, దూతం దేవ్యామహాసురం. 102.

91. అంతటి యందమగు రూపము నిదివర కెక్కడను చూడలేదు. ఆమె యెవరో తెలిసికొని దెచ్చుకొనుము.

92. ఆమె స్త్రీలలో రత్నము. మిక్కిలి రమణీయమైనది. దిక్కులను వెలిగించుచున్నది. నీవామెను చూడవలెను.

93. మూడు లోకములలోనున్న రత్నములు, మణులు, ఏనుగులు, గుఱ్ఱములు మొదలగునవి అన్నియు నిప్పుడు నీ యింటిలో నున్నవి.

94. ఇంద్రుని ఐరావత గజము, పారిజాతవృక్షము, ఉచ్చైశ్శ్రవము నీవు తెచ్చుకొంటివి.

95. బ్రహ్మకుకూడ ఆశ్చర్యము కలిగించునట్టి హంసలతోడి విమానము నీ యింటిముంగిట నున్న దిదిగో.

96. కుబేరునినుండి మహాపద్మమను నిధిని తెచ్చితివి. సముద్రుడు వాడిపోని తామరల హారమును ఇచ్చెను.

97. బంగారు రంగులు కురియుచున్న వరుణుని ఛత్రము, ప్రజాపతి యొక్క రథమును నీకు చేకూరినవి.

98. మృత్యుదేవతయొక్క ప్రాణ సంహారణశక్తిని నీ వపహరించితివి. వరుణదేవుని పాశము నీ తమ్మునికడ నున్నది.

99. సముద్రమునందు పుట్టిన రత్నజాతులన్నియు నీతమ్మునికి చేపడినవి. అగ్నిదేవుడు నీకు అగ్నిశుద్ధములైన వస్త్రము లర్పించెను.

100. రాక్షసరాజా ! ఈ రీతిగా సమస్తరత్నములు నీచేత తేబడినవి. ఇప్పుడచటనున్న ఆ స్త్రీరత్నమును మాత్రము నీవేల తెచ్చుకొనకూడదు ?

101. ఋషి యిట్లను.

102. చండముండులు చెప్పినదివిని శుంభుఁడు సుగ్రీవుఁడను పేరుగల రాక్షసుని దేవికడకు దూతగా పంపెను.

ఓం ఇతి చేతి చ వక్తవ్యా, సా గత్వా వచనా న్మమ
యథాచాభ్యేతి సంప్రీత్యా, తథాకార్యం త్వయాలఘు. 103.

ఓం సతతప్రి గత్వా యత్రాస్తే, శైలోద్దేశేఽతి శోభనే
తాంచ దేవీం తతః ప్రాహ, శ్లక్ష్ణం మధురయా గిరా. 104.

ఓం దూత ఉవాచ :— 105.

ఓం దేవి ! దైత్యేశ్వరః శుంభః, త్రైలోక్యే పరమేశ్వరః
దూతోఽహం ప్రేషిత స్తేన, త్వత్ సకాశ మిహాగతః. 106.

ఓం అవ్యాహతాజ్ఞః సర్వాసు, య స్సదా దేవయోనిషు
నిర్జితాఖిలదైత్యారిః, స య దాహ శృణుష్వతత్. 107.

ఓం మమ త్రైలోక్య మఖిలం, మమ దేవా వశానుగాః
యజ్ఞభాగా నహం సర్వాన్, ఉపాశ్నామి పృథక్ పృథక్. 108.

ఓం త్రైలోక్యే వరరత్నాని, మమ వశ్యా న్యశేషతః
తథైవ గజరత్నంచ, హృతం దేవేంద్రవాహనం. 109.

ఓం క్షీరోద మథనోద్భూతం, అశ్వరత్నం మమామరైః
ఉచ్చైశ్శ్రవస సంజ్ఞం తత్, ప్రణిపత్య సమర్పితం. 110.

ఓం యాని చాన్యాని దేవేషు, గంధర్వే షూరగేషు చ
రత్నభూతాని భూతాని, తాని మయ్యేవ శోభనే ! 111.

ఓం స్త్రీరత్నభూతాం త్వాం దేవి ! లోకే మన్యామహేవయం
సా త్వ మస్మా నుపాగచ్ఛ, యతో రత్నభుజో వయం. 112.

ఓం మాం వా మమానుజం వాపి, నిశుంభ మురువిక్రమం
భజత్వం చంచలాఽపాంగి !, రత్నభూతాసి వై యతః. 113.

ఓం పర మైశ్వర్య మతులం, ప్రాప్స్యసే మత్పరిగ్రహాత్
ఏతద్బుద్ధ్యా సమాలోచ్య, మత్పరిగ్రహతాం వ్రజ. 114.

103. ఓరీ! నీ వచటికిపోయి ఆమె వెంటనే తనకుతానే యిష్టపడి నాయొద్దకు వచ్చునట్లు నా మాటగా పలుకుమని వానితో చెప్పెను.

104. ఆ సుగ్రీవుడు హిమాలయమున ఎంతో రమ్యమైన తావుననున్న ఆ దేవియొద్దకు పోయి, మృదుమధురముగా నిట్లు పలికెను.

105. దూత యిట్లను,

106. దేవి! శుంభుడను పేరుగలవాడు ముల్లోకములకు సార్వభౌముడు. నే నాతని దూతను. మా రాజు పంపగా నీ సన్నిధికి వచ్చితిని.

107. దేవతలందఱు ఆతని యాజ్ఞను తలదాలుతురు. శత్రువులనెల్ల జయించిన ఆ మహారాజు తానుగా నీతో చెప్పుమన్నమాటలు వినుము.

108. మూడులోకములు నాయవి. దేవతలు నా చెప్పుచేతలలో నున్నారు. యజ్ఞములందలి భాగములన్నింటిని వేఱువేఱుగా ఆహరించుచున్నారు.

109. మూడులోకములలో నుత్తమ వస్తువులన్నియు నా వశమై యున్నవి. ఇంద్రుని ఐరావతము గజరత్నము నాదగ్గర నున్నది.

110. క్షీరసముద్రము చిలుకునపుడు పుట్టిన ఉచ్చైశ్శ్రవమను అశ్వరత్నమును దేవతలే నాకిచ్చిరి.

111. దేవతలలో, గంధర్వులలో, నాగులలో మరే రత్నమువంటి వున్నను అవన్నియు నా యింటనే ఉన్నవి.

112. నిన్ను లోకములోని స్త్రీరత్నముగా తలచెదము. మేము రాజులము. రత్నభుజులము. కావున నీవు మమ్ము చేరదగుదువు.

113. నీవు నిజముగా రత్నమవే. కాబట్టి నన్నుగాని, నాతమ్ముడు గొప్ప పరాక్రమశాలి యయిన నిశుంభునిగాని సేవింపుము.

114. మేము నిన్ను గ్రహించుటవలన నీవు పరమైశ్వర్యము నందఁగలవు. ఈ విషయము నీ మనసున బాగుగా ఆలోచించి నా భార్యవుకమ్ము.

ఓం ఋషి రువాచ :— 115.

ఓం ఇత్యుక్తా సా తదాదేవీ, గంభీరాంత స్స్మితా జగౌ
దుర్గా భగవతీ భద్రా, యయేదం ధార్యతే జగత్. 116.

ఓం దేవ్యువాచ :— 117.

ఓం సత్యముక్తం త్వయానాత్ర ! మిథ్యా కించిత్ త్వయోదితం
త్రైలోక్యాధిపతి శ్శుంభః, నిశుంభశ్చాపి తాదృశః. 118.

ఓం కిం త్వత్ర యత్ప్రతిజ్ఞాతం, మిథ్యా తత్క్రియతే కధం ?
శ్రూయతా మల్పబుద్ధిత్వాత్, ప్రతిజ్ఞాయా పురాకృతా. 119.

ఓం యోమాం జయతి సంగ్రామే, యోమేదర్పం వ్యపోహతి
యోమే ప్రతిబలో లోకే, సమే భర్తా భవిష్యతి. 120.

ఓం తత్ ఆగచ్ఛతు శుంభోఽత్ర, నిశుంభోవా మహాసురః
మాం జిత్వా కిం చిరేణాత్ర, పాణిం గృహ్ణాతుమే లఘు. 121.

ఓం దూత ఉవాచ :—

ఓం అవలిప్తాసి మైవం త్వం, దేవి ! బ్రూహి మమాగ్రతః
త్రైలోక్యే కః పుమాన్ తిష్ఠేత్, అగ్రే శుంభ నిశుంభయోః. 123.

ఓం అన్యేషా మపి దైత్యానాం, సర్వే దేవా నవై యుధి
తిష్ఠంతి సంముఖే దేవి ! కిం పునః స్త్రీ త్వమేకికా. 124.

ఓం ఇంద్రాద్యాః సకలా దేవాః, తస్థుర్యేషాం న సంయుగే
శుంభాదీనాం కథం తేషాం, స్త్రీ ప్రయాస్యసి సంముఖం ? 125.

ఓం సాత్వం గచ్ఛ మయై వోక్తా. పార్శ్వం శుంభనిశుంభయోః
కేశాకర్షణ నిర్ధూత, గౌరవా మా గమష్యసి. 126.

115. ఋషి యిట్లను.

116. అంతట నీ ప్రపంచమంతటిని ధరించునట్టి ఆ దుర్గాభగవతి నాని మాటలువిని లోలో నవ్వుకొని ఇట్లు పలికెను.

117. దేవి యిట్లను.

118. శుంభుడు త్రిలోకాధిపతియని, నిశుంభుడు అతనికి సమానుడని నీవు పలికినమాట (నీకు తెలిసినంతవరకు) నిజమె. ఇంచుకయువంచనలేదు.

119. కాని ఈ విషయమున నేనొక బాసచేసితిని. దానినెట్లు బొంకుచేయుదును? తెలివితక్కువగా నా యొనర్చిన ప్రతినను వినుము.

120. 'యుద్ధమున నన్నెవడు గెలుచునో, నాదర్పము నెవడడచునో, లోకమున బలమున నాకెవడుసాటియగునో అతఁడే నాకు మగడుకాగలడు?

121. అందువలన మహాసురులైన మీ శుంభుడుకాని, నిశుంభుడుగాని ఇచటికివచ్చి నన్నుజయించినచో సులభముగా నా పాణిగ్రహణసౌభాగ్యము నందఁగలుగుదురు. ఆలస్యమేల?

122. దూత యిట్లను.

123. దేవీ! నీవుచాల పొగరుపడితివి. నాయెదుట నిట్లు మాటాడకుము. శుంభనిశుంభులయెదుట నిలబడఁగల మగన్న మూడులోకములలో నెవడున్నాడు?

124. వారియెదుటకాదు. మరే రాక్షసులతోకూడ దేవతలందఱైనను యుద్ధమునకు జాలరు. ఇక ఒంటరి ఆడుదానవు నీవెంత?

124. ఇంద్రాదులైన దేవతలందరు శుంభాదులతో సమరమున సరికాక పోయిరి. ఆడుదానివి నీవెట్లు వారియెదుట బడగలవు?

126. నా మాటవిని నీవా శుంభనిశుంభుల ప్రక్కకు చేరుము. నీ తలపట్టి యీడిపించుకొను నగౌరవమునకు పాలుగాకుము.

ఓం దేవ్యువాచ :—

ఓం ఏవ మేతత్ బలీశుంభో, నిశుంభ శ్చాతివీర్యవాన్
కిం కరోమి ? ప్రతిజ్ఞా మే, య దనాలోచితా పురా. 128.

ఓం సత్వం గచ్ఛ మయోక్తం తే, య దేతత్ సర్వమాదృతః
తత్ అచక్ష్వ సురేంద్రాయ, సచయుక్తం కరోతు తత్. 129.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
దేవ్యాదూతసంవాదోనామ పంచమోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 9. ఏవం 129.
త్రిపాన్మంత్రాః 66. ఏవమాదితః 388.
శ్లోకమంత్రాః 54.

# షష్ఠోఽధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం ఇత్యాకర్ణ్య వచో దేవ్యాః, సదూతోఽమర్షపూరితః
సమాచష్ట సమాగమ్య, దైత్యరాజాయ విస్తరాత్. 2.

ఓం తస్య దూతస్య తద్వాక్యం, ఆకర్ణ్యా సురరాట్ తతః
సక్రోధః ప్రాహ దైత్యానా, మధిపం ధూమ్రలోచనం. 3.

ఓం హే ! ధూమ్రలోచ నాశుత్వం, స్వసైన్య పరివారితః
తా మానయ బలాత్ దుష్టాం, కేశాకర్షణ విహ్వలాం. 4.

ఓం తత్ పరిత్రాణదః కశ్చిత్, యది వోత్తిష్ఠతే పరః
సహంతవ్యోఽమరోవాపి, యక్షో గంధర్వ ఏవవా. 5.

127. దేవి యిట్లను.

128. నీవన్నట్లు శుంభుడు బలవంతుడే. నిశుంభుడతివీర్యుడే అనుకొందము. దాని నాలోచింపకయే నేను ముందుగా ప్రతిజ్ఞచేసితిని. మరిప్పు డేమి చేయనగును ?

129. నీవిపు డచటికేగి, నేనుచెప్పినదంతయు మార్పుచేయక ఆ రక్కసునకు తెలుపుము. అతనికి యుక్తమైన ట్లతఁడే చేయఁగలఁడు.

ఇది పంచమాధ్యాయము.

# షష్ఠాధ్యాయము.

1. ఋషి యిట్లను.

2. సుగ్రీవు డాదేవియొక్క మాటలువిని కోపము నందెను. శుంభుని దగ్గఱకు మరలివచ్చి సవిస్తరముగ వివరించెను.

3. రాక్షసరాజు దూత చెప్పినదంతయు విని మండిపడి దైత్యాధిపతియగు ధూమ్రలోచనునితో ఇట్లు పలికెను.

4. ఓయీ ? ధూమ్రలోచనా ! నీవు వెంటనే నీ సర్వసైన్యములతో పోయి ఆ దుష్టురాలిని తలపట్టి ఈడ్చుకొని ఇచటికి తీసుకొనిరా.

5. దానిని కాపాడుటకై ఎవరు వచ్చినను వాడు దేవ, యక్ష, గంధర్వుల లోనివాడైన సరే చంపివేయుము.

ఓం ఋషి రువాచ :— 6.

ఓం తే నాజ్ఞప్తః తతః శీఘ్రం, స దైత్యో ధూమ్రలోచనః
వృతః షష్ట్యా సహస్రాణా, మసురాణాం ద్రుతం యయౌ. 7.

ఓం స దృష్ట్వా తాం తతోదేవీం, తుహినాచల సంస్థితాం
జగా దోచ్చైః ప్రయాహీతి, మూలం శుంభనిశుంభయోః. 8.

ఓం నచేత్ ప్రీత్యా ద్య భవతీ, మద్భర్తార ముపైష్యతి
తతో బలా న్నయా మ్యద్య, కేశాకర్షణ విహ్వలాం. 5.

ఓం దే వ్యువాచ :— 10.

ఓం దైత్యేశ్వరేణ ప్రహితో, బలవాన్ బలసంవృతః
బలా న్నయసి మా మేవం, తతః కిం తే కరోమ్యహం. 11.

ఓం ఋషి రువాచ :— 12.

ఓం ఇత్యుక్తః సోఽభ్యధావ త్తాం, అసురో ధూమ్రలోచనః.
హుంకారేణై వ తం భస్మ, సా చకారాంబికా తతః. 13.

ఓం అథ క్రుద్ధం మహాసైన్య, మసురాణాం తథాంబికా
వవర్ష సాయకైః తీక్ష్ణైః, తథా శక్తిపరశ్వథైః. 14.

ఓం తతో ధుతసటః కోపాత్, కృత్వా నాదం సుభైరవం
పపా తాసురసేనాయాం, సింహో దేవ్యాః స్వవాహనః. 15.

ఓం కాంశ్చిత్ కరప్రహారేణ, దైత్యా నాస్యేన చాపరాన్
ఆక్రాంత్యా చాధరే ణాన్యాన్, జఘాన స మహాసురాన్. 16.

ఓం కేషాంచిత్ పాటయామాస, నఖైః కోష్ఠాని కేసరీ
తథా తలప్రహారేణ, శిరాంసి కృతవాన్ పృథక్. 17.

6. ఋషి యిట్లను.

7. శుంభునిచే ఆజ్ఞాపింపఁబడిన ధూమ్రలోచనుఁడు అరువదివేల రాక్షస సైన్యముతో వెంటనే బయలువెడలెను.

8. వాఁడు మంచుమలపై వెలయుచున్న ఆ వెలదినిచూచి 'శుంభనిశుంభుల దగ్గరకు ర' మ్మని గట్టిగా కేకవేసెను.

9. నీ యంతకు నీ విష్టముగా మా రాజుకడకు రానిచో నీ తలవెంట్రుకలు పట్టి నీ శరీరము పరవశమగునట్లు ఈడ్చికొని పోదును.

10. దేవి యిట్లను.

11. రాక్షసరాజుచే పంపబడినావు. బలవంతుఁడవు. సైన్యబలమున్నది. నీవు నన్ను బలముగ తీసికొనిపోగలవేని నేనేమి చేయనగును ?

12. ఋషి యిట్లను.

13. ఆ మాటలువిని ధూమ్రలోచనుఁడు దేవి నెదిరించుటకై ముందు కురికెను. ఆ యంబిక తన హుంకారముతోనే వానిని భస్మము చేసెను.

14. అంత నయ్యంబ తనపై కోపించిన రాక్షససైన్యముపై వాడి బాణములు, శక్తి మొదలగు ఆయుధములు వర్షమువలె కురియించెను.

15. అపుడు దేవియొక్క వాహనమగు సింహము జడలువిదిలించి, భయంకరముగా గర్జించుచు అసురసైన్యముమీద పడెను.

16. కొందరిని కాలిదెబ్బలతోను, కొందరిని నోటితోను, మరికొందరిని వెనుకకాళ్ళతో త్రొక్కియు చంపెను.

17. సింహము కొందరి పొట్టలఁజీల్చెను. కొందరి తలలను చేతులతో త్రుంచివైచెను.

ఓం విచ్ఛిన్న బాహుశిరసః, కృతాః తేన తథాఽపరే
పపౌ చ రుధిరం కోష్ఠాత్, అన్యేషాం ధుతకేసరః. 18.

ఓం క్షణేన తద్బలం సర్వం, క్షయం నీతం మహాత్మనా
తేన కేసరిణా దేవ్యా, వాహనేనాతికోపినా. 19.

ఓం శ్రుత్వా త మసురం దేవ్యా. నిహతం ధూమ్రలోచనం
బలంచ క్షయితం కృత్స్నం, దేవీ కేసరిణా తతః. 20.

ఓం చుకోప దైత్యాధిపతిః, శుంభః ప్రస్ఫురితాధరః
ఆజ్ఞాపయామాస చ తౌ. చండముండౌ మహాసురౌ. 21.

ఓం హే చండ ! హే ముండ ! బలైః, బహుభిః పరివారితే
తత్ర గచ్ఛతః గత్వాచ, సా సమానీయతాం లఘు. 22.

ఓం కేశేష్వాకృష్య బద్ధ్వావా, యది వః సంశయో యుధి
త దాశేషాయుధైః సర్వైః. అసురైః వినిహన్యతాం. 23.

ఓం తస్యాం హతాయాం దుష్టాయాం, సింహేచ వినిపాతితే
శీఘ్ర మానీయతాం బద్ధ్వా, గృహీత్వాతా మథాంబికాం. 24.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
ధూమ్రలోచన వధోనామ షష్ఠోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 4. ఏవం 24.
శ్లోకమంత్రాః 20, ఏవమాదితః 412.

18. కొందరి చేతులు. తలలు చిందరవందర చేసెను. కొందరి కుత్తుకలు కొఱికి రక్తము గుటగుట త్రావెను.

19. ఒక్కక్షణములో ఆ కోపించిన సింహము రాక్షస సైన్యము నంతటిని నాశముచేసెను.

20. ధూమ్రలోచనుఁడు దేవిచే చనిపోవుటయు, సింహముతో సైన్యమంతయు చంపఁబడుటయు.

21. రాక్షసరాజు విని కోపముతో పెదవులదరునట్లు చండ ముండులను మహాసురుల నిట్లాజ్ఞాపించెను.

22. ఓరీ చండా ! ముండా ! మీరు పెద్ద సైన్యముతోకూడ నటకేగి ఆ ఆడుదానిని త్వరగా తేవలయును.

23. తలపట్టి యీడ్చియో, త్రాళ్ళతో కట్టియో, మీ కనుమానమైన యుద్ధమున ఆయుధములతో చంపుడు.

24. ఆ దుష్టురాలు, సింహము, చచ్చినయెడల కట్టి త్వరగా నా దగ్గరకు తీసికొనిరండు.

షష్ఠాధ్యాయము.

# సప్తమోఽధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం ఆజ్ఞప్తా స్తే తతో దైత్యాః, చండముండ పురోగమాః
చతురంగ బలోపేతా, యయు రభ్యుద్యతాయుధాః. 2.

ఓం దదృశు స్తే తతో దేవీం, ఈష ద్ధాసాం వ్యవస్థితాం
సింహ స్యోపరి శైలేంద్ర, శృంగే మహతి కాంచనే. 3.

ఓం తే దృష్ట్వా తాం సమాదాతుం, ఉద్యమం చక్రు రుద్యతాః
ఆకృష్టచాపాసిధరాః, తథాన్యే తత్సమీపగాః. 4.

ఓం తతః కోపం చకారోచ్చైః, అంబికా తా నరీన్ప్రతి
కోపేన చాస్యావదనం, మషీవర్ణ మభూత్తదా. 5.

ఓం భ్రుకుటీకుటిలాత్ తస్యాః, లలాట ఫలకాత్ ద్రుతం
కాళీకరాళవదనా, వినిష్క్రాంతాఽసి పాశినీ. 6.

ఓం విచిత్ర ఘట్వాంగధరా, నరమాలా విభూషణా
ద్వీపి చర్మ పరీధానా, శుష్కమాంసాతి భైరవా. 7.

ఓం అతివిస్తారవదనా, జిహ్వాలలనభీషణా
నిమగ్నా రక్తనయనా, నాదాపూరిత దిఙ్ముఖా. 8.

ఓం సా వేగే నాభిపతితా, ఘాతయంతీ మహాసురాన్
సైన్యే తత్ర సురారీణా, మభక్షయత తద్బలం. 9.

ఓం పార్ష్ణిగ్రాహాంకుశగ్రాహి, యోధఘంటా సమన్వితాన్
సమాదా యైకహస్తేన, ముఖే చిక్షేప వారణాన్. 10.

ఓం తథైవ యోధం తురగౌ, రథం సారథినా సహ
నిక్షిప్య వక్త్రే దశనైః, చర్వయం త్యతిభైరవం. 11.

# సప్తమాధ్యాయము

1. ఋషి యిట్లను.

2. శంభునిచే ఆజ్ఞాపింపఁబడిన యసురులు చండముండులను వెంబడించి చతురంగబలముతో ఆయుధముల చేతులతో నెత్తిపట్టుకొని దేవిదగ్గరకు వెడలిరి.

3. హిమవత్పర్వతముమీద కాంచన శిఖరమునందు సింహవాహనముపై చిఱునగవుతో నున్న దేవిని వారు చూచిరి.

4. చూచినతోడనే ధనుస్సుల గుణములను లాగి కత్తులుచేబూని దేవిని పట్టుకొనఁబూని కొందరు సమీపించిరి.

5. ఆ యంబిక వారిపై మిక్కిలి కోపము వహించెను. దానితో ఆమె ముఖము మసిరంగు దాల్చెను.

6. ఆ దేవియొక్క వంకరగా భయంకరమైన బొమముడితోడి నొసటి నుండి కాళియనుశక్తి ఆవిర్భవించెను.

7. కాళి కత్తి, పాశము, వింతయైన మంచపుకోడు ఆయుధములు, మనుష్యుల తలపుఱ్ఱెల ఆభరణములు, పులిచర్మపువస్త్రముధరించి మాంసము లేని అస్థిపంజరమువలె మిక్కిలి భయంకరమైనదియు,

8. మిక్కిలి వెడదగా నోరుతెరచి, నాలుక నల్లార్చుచు లోతైన చింత నిప్పులవంటి కనులతో, దిక్కులనింపు పెడబొబ్బలు పెట్టునదియై.

9. మహా వేగముతో రాక్షస సైన్యమును చంపుచు భక్షించుచుండెను.

10. ఏనుగులను, వెంటవచ్చు సైనికులను, మావటీలను, దానిపైనున్న యోధులనుగంటలతోకూడ ఒకచేతనే గ్రహించి అట్లేనోటవేసికొనెను.

11. అట్లే గుఱ్ఱములు సారథులతోకూడ రథములను నోటబెట్టుకొని పండ్లతో గఱుక్కున నమలెను.

ఓం ఏకం జగ్రాహ కేశేషు, గ్రీవాయా మథ చాపరం
పాదే నాక్రమ్య చైవాన్యం, ఉరసాన్య మపోథయత్. 12.

ఓం తై ర్ముక్తానిచ శస్త్రాణి, మహాస్త్రాణి, తథా సురైః
ముఖేన జగ్రాహ రుషా, దశనై ర్మథితా న్యపి. 13.

ఓం బలినాం తద్బలం సర్వ, మసురాణాం నిపాతతం
మమ ర్దాభక్షయ చ్చాన్యాన్, అన్యాం శ్చాతాడయత్తదా. 14.

ఓం అసినా నిహతాః కేచిత్ కేచిత్ ఖట్వాంగ తాడితాః
జగ్ము ర్వినాశ మసురా, దంతాగ్రాభిహతా స్తథా. 15.

ఓం క్షణేన తద్బలం సర్వం, అసురాణాం నిపాతితం
దృష్ట్వా చండోఽభిదుద్రావ, తాం కాళీ మతిభీషణాం. 16.

ఓం శరవర్షైః మహాభీమైః, భీమాక్షీం తాం మహాసురః
ఛాదయామాస చక్రైశ్చ, ముండః క్షిప్తైః సహస్రశః. 17.

ఓం తాని చక్రాణ్యనేకాని, విశమానాని తన్ముఖం
బభు ర్యథార్క-బింబాని, సుబహూని ఘనోదరం. 18.

ఓం తతో జహా సాతిరుషా, భీమం భైరవనాదినీ.
కాళీ కరాళవక్త్రాంత, ర్దుర్దర్శ దశనోజ్జ్వలా. 19.

ఓం ఉత్థాయచ మహాసిం-హం, దేవీ చండ మధావత
గృహీత్వా చాస్య కేశేషు, శిర స్తేనాసినా చ్ఛినత్. 20.

ఓం అథ ముండోఽ భ్యధావత్తాం, దృష్ట్వా చండం నిపాతితం
త మ ప్యపాతయ ద్భూమౌ, సా ఖడ్గాభిహతం రుషా. 21.

ఓం హతశేషం తత స్సైన్యం, దృష్ట్వా చండం నిపాతితం
ముండంచ సుమహావీర్యం, దిశో భేజే భయాతురం. 22.

12. సైనికులలో నొక్కొక్కని జుట్టుపట్టుకొని లాగి, గొంతు పిడిచి నొక్కి, కాళ్ళుపట్టి యీడ్చి, గుండెలపై గ్రుద్ది చంపెను.

13. రాక్షసులచే విడువబడిన శస్త్రాస్త్రములను నోటబట్టి పండ్లతో పిండి చేసెను.

14. ఇట్లు బలవంతమైన వారి బలమునంతటిని పడఁగొట్టి, నమలిమ్రింగి. అణచివేసెను.

15. కొందఱను కత్తితోనఱకి, కొందఱిని మంచపుకోటితో మర్దించి, పంటి క్రింద పడవేసి పాడుచేసెను.

16. క్షణములో తమ సైన్యమంతయు తరిగిపోవుట చూచి చండుడు ఆ భీకర కాళిపై నుఱికెను.

17. చండుడు క్రూర బాణవర్షముతోను, ముండుడు వేనవేలు చక్రముల తోను కాళిని కప్పివైచిరి.

18. ఆ చక్రాయుధములన్నియు కాళినోట ప్రవేశించునపుడు అనేక సూర్య బింబములు మేఘగర్భమునకు పోవుచున్నట్లుండెను.

19. అపుడు ఆ కాళి అతికోపముతో మృత్యుగహ్వరముబోని వెఱ కిరవగు తననోటిలోని కనులు మిఱుమిట్లుకొలుపు కాంతులతో దంతము లగ పడునట్లు వికటముగా నవ్వెను.

20. తన చేతిలోని కత్తిని పైకెత్తి—హుంకరించి, చండునిజుట్టు ఒకచేత పిడికిటబట్టి, మరొకచేతి ఖడ్గముతో వానితల కఱక్కున తరిగెను.

21. చండుడు పడిపోవుటచూచి ముండుడు కాళిపైకి రాగా, ఆమె వానిని కత్తితో నేలగూల్చెను.

22. చండముండులు పడిపోవుటచూచి చావగా మిగిలినసైన్యము బెదరి దిక్కుకొకడుగా పరుగెత్తెను.

ఓం శిర శ్చండస్య కాళీచ, గృహీత్వా ముండ మేవచ
ప్రాహ ప్రచండాట్టహాస, మిశ్ర మభ్యేత్యచండికాం. 23.

ఓం మయా త వాత్రోపహృతౌ, చండముండౌ మహాపశూ
యుద్ధయజ్ఞే స్వయం శుభం, నిశుంభంచ హనిష్యసి. 24.

ఓం ఋషి రువాచ :— 25.

ఓం తావానీతౌ తతో దృష్ట్వా, చండముండౌ మహాసురౌ
ఉవాచ కాళీం కల్యాణీ, లలితం చండికా వచః. 26.

ఓం యస్మా చ్చండంచ ముండంచ, గృహీత్వా త్వ ముపాగతా
చాముండేతి తతో లోకే, ఖ్యాతా దేవీ భవిష్యసి. 27.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
చండముండవధోనామ సప్తమోఽధ్యాయః

| | | | |
|---|---|---|---|
| ఉవాచమంత్రాః | 2. | ఏవం | 27. |
| శ్లోకాః | 25. | ఏవమాదితః | 439. |

# అష్టమోఽధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం చండేచ నిహతే దైత్యే, ముండేచ వినిపాతితే
బహుళేషుచ సైన్యేషు, క్షయితే ష్వసురేశ్వరః. 2.

ఓం తతః కోపపరాధీన, చేతాః శుభః ప్రతాపవాన్
ఉద్యోగం సర్వసైన్యానాం, దైత్యానా మాదిదేశహ. 3.

23. కాళియు చండముండుల తలలు రెండుచేతుల పట్టుకొని చండికనుచేరి వికటముగా నవ్వుచు నిట్లనెను.

24. చండికా! ఈ యుద్ధమనెడి యజ్ఞమునందు నీకోసమై నేనీచండముండులనెడి పశువులను తెచ్చితిని. ఇఁక నీవు శుంభనిశుంభులను స్వయముగ చంపవలసియున్నది.

25. ఋషి యిట్లను.

26. కాళి తెచ్చిన చండముండులను చూచి చండీదేవి ఆమెతో లలితముగా నిట్లు పలికెను.

27. దేవీ! నీవీ చండుని ముండుని తీసికొని వచ్చితివి కనుక మున్ముందు లోకములో చాముండ అని ఖ్యాతి నందఁగలుగుదువు.

సప్తమాధ్యాయము.

# అష్టమాధ్యాయము

1. ఋషి యిట్లను.

2. చండుడు ముండుడు చచ్చుట, చాలవరకు సైన్యము నశించుటచూచి.

3. ప్రతాపవంతుడైన శుంభుఁడు కోపపరవశుఁడయి, తమ సర్వసైన్యములకును దేవితో యుద్ధముచేయ నాజ్ఞాపించెను.

ఓం ఆద్య సర్వబలైః దైత్యాః, షడశీతి రుదాయుధాః
కంబూనాం చతురాశీతిః, నిర్యాంతు స్వబలైర్యుతః. 4.

ఓం కోటివీర్యాణి పంచాశత్, అసురాణాం కులాని వై
శతం కులాని ధౌమ్రాణాం, నిర్గచ్ఛంతు మమాజ్ఞయా. 5.

ఓం కాలకా దౌర్హృదా మౌర్యాః, కాలకేయా స్తథాసురాః
యుద్ధాయ సజ్జా నిర్యాంతు, ఆజ్ఞయా త్వరితా మమ. 6.

ఓం ఇత్యాజ్ఞ ప్యాసురపతిః, శుంభో భైరవశాసనః
నిర్జగామ మహాసైన్య, సహస్రైః బహుభిర్వృతః. 7.

ఓం ఆయాంతం చండికా దృష్ట్వా, తత్సైన్య మతిభీషణం
జ్యాస్వనైః పూరయామాస, ధరణీగగనాంతరం. 8.

ఓం తత స్సింహో మహానాద, మతీవ కృతవాన్ నృప ః
ఘంటాస్వనేన తన్నాద, మంబికా చోపబృంహయత్. 9.

ఓం ధనుర్జ్యా సింహఘంటానాం, నాదాపూరిత దిఙ్ముఖా
నినాదైః భీషణైః కాళీ, జిగ్యే విస్తారితాననా. 10.

ఓం తం నినాద ముపశ్రుత్య, దైత్యసైన్యైః చతుర్దిశం
దేవీ-సింహ స్తథా కాళీ, సరోషైః పరివారితాః. 11.

ఓం ఏతస్మి న్నంతరే భూప ః వినాశాయ సురద్విషాం
భవా యామరసింహానా, మతివీర్య బలాన్వితాః. 12.

ఓం బ్రహ్మేశ గుహ విష్ణూనాం, తథేంద్రస్య చ శక్తయః
శరీరేభ్యో వినిష్క్రమ్య, తద్రూపైః చండికాం యయుః. 13.

ఓం యస్య దేవస్య యద్రూపం, యథాభూషణవాహనం
తద్వ దేవహి తచ్ఛక్తిః, అసురాన్ యోద్ధు మాయయౌ. 14.

4. ఇప్పుడే తమ సమస్తబలముతో దైతేయు లెనుబది ఆఱుగురును, కంబులు ఎనుబదినలుగురును, ఆయుధము లెత్తుకొని యుద్ధమునకు వెడలవలసినది.

5. ఏబదికోట్లు వీర్యులకులములును, నూఱుకులముల ధౌమ్రులును నా ఆజ్ఞతో బయలుదేరవలసినది.

6. కాలకులు, దౌర్హృదులు, మౌర్యులు, కాలకేయులు అనుపేర్ల రాక్షసులును నా ఆజ్ఞతో వెంటనే నడవవలసినది.

7. ఉగ్రశాసనుడగు శుంభు డిట్లాజ్ఞాపించి, తాను స్వయముగ వేలసంఖ్యల మహాసైన్యముతో బయలుదేరెను.

8. అట్లు వచ్చుచున్న మిక్కిలిభయంకరమగు ఆ రాక్షససైన్యమునుచూచి చండిక తనచేతిలోని వింటినారి చప్పుడుఁతో భూమి ఆకాశమధ్యమును నింపెను.

9. రాజా! (సురథుఁడా!) అపుడు సింహము గొప్పగా గర్జించెను. దేవి ఘంటాధ్వనితో దానిని పెద్దచేసెను.

10. కాళి తననోరు విస్తారముగాతెరచి పై వింటినారియొక్క, సింహము యొక్క,ఘంటయొక్క అన్నిటియొక్కధ్వనితానేచేయుచు తెలియబడెను.

11. దైత్యసైన్యములు ఆ కాళి కేకలువిని నాలుగు దిక్కులనుండి వచ్చి దేవిని సింహమును కాళిని చుట్టుముట్టెను.

12. రాజా! ఆ సమయమందె రాక్షసుల వినాశము కొఱకును, దేవత శ్రేష్ఠుల అభివృద్ధికొఱకును.

13. బ్రహ్మ, శివ, స్కంద, విష్ణు, ఇంద్రులయొక్క శక్తులు అతివీర్యబలములతో వారి శరీరములనుండి వెడలివచ్చి చండికను చేరిరి.

14. ఏ దేవున కేరూపము ఏ భూషణము ఏ వాహనము లుండునో అదేరీతి గనే ఆయాశక్తులు అసురులతో యుద్ధము చేయవచ్చెను.

ఓం హంసయుక్త విమానాగ్రే, సాక్షసూత్ర కమండలుః
ఆయాతా బ్రహ్మణః శక్తిః, బ్రహ్మాణీ సాఽభిధీయతే. 15.

ఓం మాహేశ్వరీ వృషారూఢా, త్రిశూల వరధారిణీ.
మహాహివలయా ప్రాప్తా. చంద్రరేఖా విభూషణా. 16.

ఓం కౌమారీ శక్తిహస్తాచ, మయూరవరవాహనా
యోద్ధు మభ్యాయయౌ దైత్యాన్, అంబికా గుహరూపిణీ. 17.

ఓం తథైవ వైష్ణవీశక్తిః, గరుడోపరిసంస్థితా
శంఖ చక్ర గదా శార్ఙ్గ, ఖడ్గహస్తాఽభ్యుపాయయౌ. 18.

ఓం యజ్ఞవారాహ మతులం, రూపం యా బిభ్రతో హరేః
శక్తి స్సా ప్యాయయౌతత్ర, వారాహీం బిభ్రతీ తనుం. 19.

ఓం నారసింహీ నృసింహస్య. బిభ్రతీ సదృశం వపుః
ప్రాప్తా తత్ర సటాక్షేప, క్షిప్త నక్షత్ర సంహతిః. 20.

ఓం వజ్ర హస్తా తథై వేంద్రీ, గజరాజోపరి స్థితా
ప్రాప్తా సహస్రనయనా. యథాశక్ర స్తథైవసా. 2(

ఓం తతః పరివృత స్తాభి, రీశానో దేవశక్తిభిః
హన్యంతా మసురాశ్శీఘ్రం, మమప్రీత్యాహ చండికాం. 22.

ఓం తతో దేవీశరీరాత్తు, వినిష్క్రాంతా తిభీషణా
చండికాశక్తి రత్యుగ్రా, శివాశత నినాదినీ. 23.

ఓం సాచాహ ధూమ్రజటిలం, ఈశాన మపరాజితా
దూతత్వం గచ్ఛ భగవన్ !, పార్శ్వం శుంభనిశుంభయోః. 24.

ఓం బ్రూహి శుభం నిశుంభంచ, దానవా వతిగర్వితౌ
యేచాన్యే దానవా స్తత్ర. యుద్ధాయ సముపస్థితాః. 25.

15. బ్రహ్మయొక్కశక్తి హంసలఁబూనిచిన విమానమెక్కి జపమాలయు కమండలువు తాల్చి, బ్రిహ్మణియను పేరుతో వచ్చెను.

16. మాహేశ్వరి వృషభమునెక్కి త్రిశూలాయుధము ధరించి పాఁప (పాము) కంకణములతో, జాబిలిరేక తొడవుగా వచ్చెను.

17. కౌమారి శక్త్యాయుధము చేతఁబూని, నెమలివాహనముపై కుమార స్వామి ఆకారముతో అరుదెంచెను.

18. వైష్ణవి గరుడవాహనముపై శంఖము, చక్రము, గద, శార్ఙ్గము (వింటిపేరు) చేతులలో ధరించి ఏతెంచెను.

19. హరియొక్క యజ్ఞవరాహరూపము దాల్చినశక్తి వారాహి నామముతో వచ్చెను.

20. నరసింహస్వామితో సమానమైన శరీరము తాలిచి నారసింహి మూపు మీది కేసరముల విదిలించుటతో నక్షత్రములరాల్చుచు నచటికివచ్చెను.

21. ఐంద్రి, వజ్రహస్తయు, గజవాహనయు, సహస్రినయనయు అగుచు నింద్రునివలెనే అరుదెంచెను.

22. ఆ దేవశక్తులతోకూడి ఈశానుడు (శివుడు) అక్కడికివచ్చి చండికతో 'నాకు పీ్రితిగా ఈ రాక్షసులనందరిని త్వరగా చంపు' మని చెప్పెను.

23. అపుడు దేవి శరీరమునుండి మిక్కిలి భీషణమైన ఒకశక్తి ఘోర ముగా నూఱుంతల ధ్వనితో నుద్భవించెను.

24. ఆ చండీశక్తి ధూమ్రివర్ణపు జడలుగల శివునితో 'భగవానుడా ! నీవు శుంభ నిశుంభులకడకు దూతగా' బొమ్ము.

25. అతి గర్వితులైన శుంభ నిశుంభులతోను, ఇంకను ఆవైపు యుద్ధము నకై చేరియుండిన దనుజులతోను ఇట్లు చెప్పుము.

ఓం త్రైలోక్య మింద్రో లభతాం, దేవాస్సంతు హవిర్భుజః
యూయం ప్రయాత పాతాళం, యది జీవితు మిచ్ఛథ. 26.

ఓం బలావలేపా దథచేత్, భవంతో యుద్ధకాంక్షిణః
త దాగచ్ఛత; తృప్యంతు, మచ్ఛివాః పిశితేన వః. 27.

ఓం యతో నియుక్తో దౌత్యేన, తయాదేవ్యా శివ స్స్వయం
శివదూతీతి లోకేஉస్మిన్, తత స్సాఖ్యాతి మాగతా. 28.

ఓం తేపి శ్రుత్వా వచో దేవ్యాః, శర్వాఖ్యాతం మహాసురాః
అమర్షాపూరితా జగ్ముః, యతః కాత్యాయనీ స్థితా. 29.

ఓం తతః ప్రథమ మేవాగ్రే, శరశక్త్యృష్టి వృష్టిభిః
వవర్షు రుద్ధతా మర్షాః, తాందేవీ మమరారయః. 30.

ఓం సాచ తాన్ ప్రహితాన్ బాణాన్, శూలశక్తి పరశ్వథాన్
చిచ్ఛేద లీలయాధ్మాత, ధనుర్ముక్తైః మహేషుభిః. 31.

ఓం తస్యాగ్రత స్తథా కాళీ, శూలపాత విదారితాన్
ఖట్వాంగపోథితాం శ్చారీన్, కుర్వంతీ వ్యచరన్ తదా. 32.

ఓం కమండలు జలాక్షేప, హతవీర్యాన్ హతౌజసః
బ్రహ్మణీ చాకరోత్ శత్రూన్, యేన యేనస్మ ధావతి. 33.

ఓం మాహేశ్వరీ త్రిశూలేన, తథా చక్రేణ వైష్ణవీ
దైత్యాన్ జఘాన కౌమారీ, తథా శక్త్యాஉతికోపనా. 34.

ఓం ఐంద్రీ కులిశపాతేన, శతశో దైత్యదానవాః
పేతు ర్విదారితాః పృథ్వ్యాం, రుధిరౌఘ ప్రవర్షిణః. 35.

ఓం తుండప్రహారవిధ్వస్తా, దంష్ట్రాగ్రక్షత వక్షసః
వారాహమూర్త్యా న్యపతన్, చక్రేణ చ విదారితాః. 36.

26. మీరు బ్రతుకదలచితిరేని పాతాళమునకు తరలిపొండు. ఇంద్రుడు ముల్లోకముల నేలనిండు. దేవతలకు యజ్ఞభాగముల లభింపనిండు.

27. బలగర్వముతో మీరు యుద్ధమునే కోరినయెడల వెడలిరండు. నా శివ శక్తులు మీ మాంసములతో తనివి నొందఁగలవు.

28. అట్లు ఆ దేవి శివుని తనదూతగా చేసికొనుటతో అప్పటినుండి ఆదేవికి 'శివదూతి' యని పేరుకల్గెను.

29. శుంభాదులు శివునివలన ఆ దేవి చెప్పిపంపిన పలుకులువిని బలముతోడి రోషమువహించి యుద్ధమునకే కాత్యాయని (దేవి) యున్నవైపుకేగిరి.

30. రాక్షససైన్యములే మొదట దేవిపైని కోపపూర్ణులై బాణ, శక్తి, ఖడ్గాది ఆయుధముల వర్షము కురియించిరి.

31. ఆ దేవి వారు ప్రయోగించిన ఆయుధములను తన ధనుస్సునుండి వెడలించిన బాణములతో విలాసముగా విరిచివైచెను.

32. చండికయొక్క ముందుభాగమున కాళి శూలముతోను ఖట్వాంగము తోను (మంచపుకోడు) కొట్టి రాక్షసులను చంపుచు సంచరించెను.

33. బ్రహ్మాణి తాను పోయినంతదూరము తన కమండలువులోని జలము చల్లుటతో శత్రువుల బలవీర్యములను హరించుచుండెను.

34. మాహేశ్వరి త్రిశూలముతోను, వైష్ణవి చక్రముతోను, కౌమారి శక్తి తోను రాక్షసుల చంపిరి.

35. ఐంద్రి, వజ్రాయుధ ప్రయోగముతో నూర్లకొలది దైత్యులను దాన వులను నెత్తురులు కక్కించి నేలఁబడఁగొట్టెను.

36. వారాహి తనతొండము (ముట్టె) తో త్రోచి, దంతములతో రొమ్ములు చీల్చి, చక్రముతో విదళించి శత్రువుల సమయించెను.

ఓం నఖైః విదారితాన్ శ్చాన్యాన్, భక్షయంతీ మహాసురాన్
నారసింహీ చచారాజౌ, నాదాపూర్ణ దిగంతరా. 37.

ఓం చండాట్టహాసై రసురాః, శివదూత్యభిదూషితాః
పేతుః పృథివ్యాం పతితాన్, తాం శ్చ చకారాథ సాతదా. 38.

ఓం ఇతి మాతృగణం క్రుద్ధం, మర్దయంతం మహాసురాన్.
దృష్ట్వాఽ భ్యుపాయై ర్వివిధైః, నేశుః దేవారిసైనికాః. 39.

ఓం పలాయనపరాన్ దృష్ట్వా, దైత్యాన్ మాతృగణార్దితాన్
యోద్ధు మభ్యాయయౌ క్రుద్ధో, రక్తబీజో మహాసురః. 40.

ఓం రక్తబిందు ర్యదాభూమౌ, పతత్యస్య శరీరతః
సముత్పతతి మేదిన్యాం, తత్ప్రమాణో మహాసురః. 41.

ఓం యుయుధే స గదాపాణిః, ఇంద్రశక్త్యా మహాసురః
తతశ్చైంద్రీ స్వవజ్రేణ, రక్తబీజ మతాడయత్. 42.

ఓం కులిశే నాహతస్యాశు, బహుసుస్రావ శోణితం
సముత్తస్థుః తతోయోధాః, తద్రూపాః తత్పరాక్రమాః. 43.

ఓం యావంతః పతితా స్తస్య, శరీరా ద్రక్తబిందవః
తావంతః పురుషాజాతాః, తద్వీర్య బలవిక్రమాః. 44.

ఓం తే చాపి యుయుధు స్తత్ర, పురుషా రక్తసంభవాః
సమం మాతృభి రత్యుగ్ర, శస్త్రపాతాతి భీషణం. 45.

ఓం పునశ్చ వజ్రపాతేన, క్షత మస్య శిరో యదా
వవాహ రక్తం; పురుషాః, తతో జాతా స్సహస్రశః. 46.

ఓం వైష్ణవీ సమరే చైనం; చక్రేణాభి జఘానహ
గదయా తాడమామాస; ఐంద్రీ త మసురేశ్వరం. 47.

37. నారసింహి గర్జనలతో దిక్కులు పిక్కటిల్లునట్లు రక్కసుల గోళ్ళతో అక్కి మెక్కుచు విహరించెను.

38. శివదూతి పెటపుగటపు నట్టహాసములతో శత్రుసైన్యము స్పృహతప్పి నేల కొఱగునట్లు చేసెను.

39. ఇట్లు మాతృగణము కోపించి అనేకోపాయములతో రక్కసుల నుక్కడచుట చూచి, సైనికులు పిక్కబలము చూపిరి.

40. బ్రాహ్మ్యాది మాతృగణముతో పీడింపఁబడి పరుగెత్తుచున్న సైనికుల చూచి రక్తబీజుడను రాక్షసుడు దేవితో పోరుటకై ఎదురయ్యెను.

41. వాని శరీరమునుండి ఒక్క నెత్తురుచుక్క నేలపై పడునప్పటికి వాని యంతటి మహాసురుఁడు పుట్టుకొని వచ్చెను.

42. రక్తబీజుఁడు గద చేతఁబూని ఇంద్రశక్తితో పోరెను. ఐంద్రి తన వజ్రముతో వానిని కొట్టెను.

43. వాని శరీరమునుండి నెత్తురు దండిగాకారెను. దానినుండి వానిరూపము వానివంటి పరాక్రమము కలిగిన యోధులు జనించిరి.

44. వాని శరీరమునుండి ఎన్ని నెత్తురుచుక్కలు నేలరాలెనో అందఱు వానివంటి పురుషులు పుట్టిరి.

45. ఆ నెత్తురునుండి క్రొత్తగాపుట్టిన పురుషులు మాతృగణముతో ఘోర శస్త్రములతో భయంకరముగ యుద్ధము సలిపిరి.

46. ఐంద్రి రక్తబీజుని శిరముపై మరల వజ్రముతో ప్రహరించెను. రక్తము వెల్లువగా ప్రవహించెను. అందునుండి వేనకువేలు పురుషులు పుట్టుకొని వచ్చిరి.

47. ఐంద్రితో పోరుచున్న రక్తబీజుని వైష్ణవి తనచక్రముతోను, గదతోను కొట్టి దట్టించెను.

ఓం వైష్ణవీ చక్రభిన్నస్య, రుధిరస్రావ సంభవైః
సహస్రశో జగత్వ్యాప్తం, తత్ప్రమాణైః మహాసురైః. 48.

ఓం శక్త్యా జఘాన కౌమారీ, వారాహీ చ తథాసినా
మాహేశ్వరీ త్రిశూలేన, రక్తబీజం మహాసురం. 49.

ఓం స చాపి గదయా దైత్యః, సర్వా ఏవాహనత్ పృథక్
మాతౄః కోపసమావిష్టో, రక్తబీజో మహాసురః. 50.

ఓం తస్యాహతస్య బహుధా, శక్తిశూలాదిభి ర్భువి
పపాత యోవై రక్తౌఘః, తేనాసన్ శతశోఽసురాః. 51.

ఓం తైశ్చాసురాసృక్ సంభూతై, రసురైః సకలం జగత్
వ్యాప్త మాసీత్; తతో దేవా, భయ మాజగ్ము రుత్తమం. 52.

ఓం తాన్ విషణ్ణాన్ సురాన్ దృష్ట్వా, చండికాప్రాహ సత్వరా
ఉవాచ కాళీం చాముండే! విస్తీర్ణం వదనంకురు. 53.

ఓం మచ్ఛస్త్రపాత సంభూతాన్, రక్తబిందూన్ మహాసురాన్
రక్తబిందోః ప్రతీచ్ఛ త్వం, వక్త్రేణానేన వేగితా, 54.

ఓం భక్షయంతీ చర రణే, తదుత్పన్నాన్ మహాసురాన్
ఏవ మేషః క్షయం దైత్యః, క్షీణరక్తో గమిష్యతి. 55.

ఓం భక్ష్యమాణాః త్వయాచోగ్రా, న చోత్పత్స్యంతిచాపరే
ఇత్యుక్త్వా తాం తతోదేవీ, శూలేనాభిజఘాన తం. 56.

ఓం ముఖేన కాళీ జగృహే, రక్తబీజస్య శోణితం
తతోఽసా వాజఘానాథ, గదయా తత్ర చండికాం. 57.

ఓం నచాస్యా వేదనాం చక్రే, గదాపాతోఽల్పికా మపి
తస్యా హతస్య దేహాత్తు, బహుసుస్రావ శోణితం. 58.

48. వైష్ణవీచక్రముతో చీల్చబడిన రక్తబీజుని రక్తమునుండి పుట్టిన వేలాది పురుషులతో జగము నిండిపోయెను.

49. కౌమారి శక్త్యాయుధముతోను, వారాహి ఖడ్గముతోను, మాహేశ్వరి త్రిశూలముతోను, రక్తబీజుని ప్రహరించిరి.

50. రక్తబీజుడు కోపముతో ఆ మాతల ఒక్కొక్కరిని వేఱువేఱుగా నందరిని గదతో కొట్టెను.

51. శక్తి శూలము మొదలగు ఆయుధములతో చాలగా కొట్టబడిన రక్తబీజుని యొడలినుండి కారినరక్తముతో నూర్లకొలదిరాక్షసులు పుట్టిరి.

52. వారందరితో జగమంతయు వ్యాపింపబడెను. అపుడు దేవతలందఱు మిక్కిలి భయమునొందిరి.

53. చండిక (కౌశికి) దుఃఖించుచున్న దేవతలనుచూచి త్వరపడి కాళితో ఇట్లుచెప్పెను. 'చాముండా ! నీ నోరు విస్తీర్ణము చేయుము.

54. నా శస్త్రము దెబ్బలతో జనించిన నెత్తురుచుక్కలను, వానినుండిపుట్టిన మహాసురులను నీ విప్పారిన నోటితో త్వరత్వరగా అందుకొనుము.

55. వానిని నమలి తినుచు యుద్ధమున సంచరింపుము. ఇట్లైన నా రాక్షసుడు నెత్తురుతగ్గి క్షయమునందును.

56. 'నీతో తినబడుచున్నవారు మరల పుట్టజాలరు.' ఇట్లు కాళితో పలికి తాను శూలముతో రక్తబీజుని పొడిచెను.

57. కాళి వాని రక్తమును నోట పీల్చెను. వాడును చండికను గదతో కొట్టెను.

58. వాని గదపెట్టు చండికకు ఇంచుకంతైన బాధ కలిగింపలేదు. వాని శరీరమునుండి నెత్తురు ఎక్కువగా స్రవించెను.

ఓం యత స్తత స్తద్వ_క్త్రేణ, చాముండా సంప్రతీచ్ఛతి
ముఖే సముద్గతా యేఽస్యా, రక్తపాతా న్మహాసురాః. 59.

ఓం తాన్ చఖాదాథ చాముండా, పపౌ తస్యచ శోణితం
దేవీ శూలేన వజ్రేణ, బాణై రసిభి ఋష్టిభిః 60.

ఓం జఘాన రక్తబీజంతం, చాముండా పీతశోణితం
స పపాత మహీపృష్ఠే, శస్త్ర సంఘ సమాహతః. 61.

ఓం నీరక్తశ్చ మహీపాల !, రక్తబీజో మహాసురః
తత స్తే హర్ష మతులం, అవాపుః త్రిదశా నృప. 62.

ఓం తేషాం మాతృగణో జాతో, ననర్తాసృ జ్మదోద్ధతః. 63.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
రక్తబీజవధోనామ అష్టమోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 1. ఏవం 63.
అర్ధమంత్రాః 1. ఏవమాదితః 502.
శ్లోకమంత్రాః 61.

# నవమోఽధ్యాయః

ఓం రాజోవాచ :— 1.

ఓం విచిత్ర మిద మాఖ్యాతం, భగవన్ భవతా మమ
దేవ్యా శ్చరితమాహాత్మ్యం, రక్తబీజ వధాశ్రితం. 2.

ఓం భూయ శ్చేచ్ఛామ్యహం శ్రోతుం, రక్తబీజే నిపాతితే
చకార శుంభో యత్కర్మ, నిశుంభ శ్చాతికోపనః. 3.

59. ఎక్కడెక్కడ నెత్తురు స్రవించెనో దానినంతయు చాముండ (కాళి తన నోటితో పీల్చుకొనుచుండెను.

60. వానిరక్తముతో పుట్టినవారినికూడ భక్షించుచుండెను. చండిక శూల ద్యాయుధములతో.

61. కాళిచే త్రాగబడిన రక్తముగల రక్తబీజుని ప్రహరించెను. వాఁ పెక్కు శస్త్రములతో కొట్టఁబడి భూమిపై పడిపోయెను.

62. రాజా ! అంత దేవతలందఱు మిక్కిలి సంతసించిరి.

63. మాతృగణము రక్తపాన మదవివశమై నృత్యము చేసెను.

అష్టమాధ్యాయము.

# నవమాధ్యాయము.

1. రాజిట్లను.

2. భవగన్ ! దేవీచరిత్రము, మాహాత్మ్యము, చాలచిత్రమగు రక్తబీజ వధకు సంబంధించినంతవరకు చెప్పితిరి.

3. రక్తబీజుడు పడిపోయినతరువాత శుంభుడును, అతికోపనుడు నిశుంభుడును ఏమిచేసిరో ఇంకను వినగోరెదను.

ఓం ఋషి రువాచ :— 4.

ఓం చకార కోప మతులం, రక్తబీజే నిపాతితే
శుంభాసురో నిశుంభశ్చ, హతేష్వన్యేషు చాహవే. 5.

ఓం హన్యమానం మహాసైన్యం, విలోక్యామర్ష ముద్వహన్
అభ్యధావ న్నిశుంభోఽధ, ముఖ్యయాఽసుర సేనయా. 6.

ఓం తస్యాగ్రత స్తథాపృష్ఠే, పార్శ్వయోశ్చ మహాసురాః
సందష్టౌష్ఠపుటాః కృద్ధా, హతుం దేవీ ముపాయయుః. 7.

ఓం ఆజగామ మహావీర్యః, శుంభోఽపి స్వబలైః వృతః
నిహతుం చండికాం కోపాత్. కృత్వాయుద్ధంతు మాతృభిః. 8.

ఓం తతో యుద్ధ మతీ వాసీత్, దేవ్యాః శుంభనిశుంభయోః
శరవర్ష మతీ వోగ్రిం, మేఘయో రివ వర్షతోః. 9.

ఓం చిచ్ఛే దాస్తాన్ శరాన్ తాభ్యాం, చండికా స్వశరోత్కరైః
తాడయామాస చాంగేషు, శస్త్రౌఘై రసురేశ్వరౌ. 10.

ఓం నిశుంభో నిశితం ఖడ్గం, చర్మ మాదాయ సుప్రభం
అతాడయ న్మూర్ధ్నిసింహం. దేవ్యా వాహన ముత్తమం. 11.

ఓం తాడితే వాహనే దేవీ, క్షురప్రేణాసి ముత్తమం
నిశుంభస్యాశు చిచ్ఛేద, చర్మచాప్యష్ట చంద్రకం. 12.

ఓం ఛిన్నే చర్మణి ఖడ్గేచ, శక్తిం చిక్షేప సోఽసురః
తామ ప్యస్య ద్విధా చక్రే, చక్రేణాభిముఖాగతాం. 13.

ఓం కోపాధ్మాతో నిశుంభోధ, శూలం జగ్రాహ దానవః
ఆయాంతం ముష్టిపాతేన. దేవీ తచ్చా ప్యచూర్ణయత్. 14.

ఓం ఆవివ్యాధ గదాంసోఽపి, చిక్షేప చండికాం ప్రతి
సాఽపి దేవ్యా త్రిశూలేన, భిన్నా భస్మత్వమాగతా. 15.

4. ఋషి యిట్లను.

5. రక్తబీజుడును, ఇతరవీరులును చచ్చిపోగా శుంభనిశుంభులు దేవిపై అత్యంత ఆగ్రహము పూనిరి.

6. అప్పటికినీ చంపబడుచున్న తమ మహాసైన్యమునుచూచి నిశుంభుడు క్రోధముతో ముఖ్యమైన అసురసేనతోకూడి దేవికెదురుగాపరుగెత్తెను.

7. ఆతని వెనుకను, ముందును, ప్రక్కలను పేరుమోసిన రాక్షసులు క్రుద్ధులై పెదవులుకొఱకుచు దేవినిచంపఁబూని తోడ నడచిరి.

8. మహావీర్యుడయిన శుంభుడుకూడ తన సొంతసేనలతోకలిసి చండిక తోను, మాతలతోను యుద్ధమొనరించి చంపుటకుగా వెడలివచ్చెను.

9. అంత దేవికిని శుంభనిశుంభులకును పోరు ఘోరముగనయ్యెను. మేఘములు వర్షముకురియించునట్లు బాణములువిరివిగా నామెపై కుప్పించిరి.

10. దేవి వారి శరములను తన శరపరంపరలతో ఖండించి వారి దేహము లందు బాణముల గ్రుచ్చెను.

11. నిశుంభుడు వాడియైన ఖడ్గమును, మెఱుగుడాలునుబూని దేవి వాహన సింహము తలపై కొట్టెను.

12. దేవి తనవాహనమును కొట్టినవాని కత్తిని, అష్టచంద్రకమను వాని డాలును తన వాడికత్తితో ముక్కలుముక్కలు చేసెను.

13. నిశుంభుడు డాలు విరిగిపోగా శక్తిని విసరెను. దేవియు తనపైకి వచ్చుదానిని చక్రముతో రెండుతుంటలు చేసెను.

14. నిశుంభుడు మండిపడుచు శూలము నెత్తికొనెను. దేవి దానిని తన పిడికిటితోనె పిండియొనర్చెను.

15. అంత వాడు గదను విసరగా చండిక త్రిశూలముతో దానిని విరుచుటే కాక బూది యొనరించెను.

ఓం తతః పరశుహస్తం తం, ఆయాంతం దైత్యపుంగవం
ఆహత్య దేవీ బాణౌఘైః, అపాతయత భూతలే. 16.

ఓం తస్మిన్ నిపతితే భూమౌ, నిశుంభే భీమవిక్రమే
భ్రాతర్యతీవ సంక్రుద్ధః, ప్రయయౌ హంతు మంబికాం. 17.

ఓం స రథస్థః తథాత్యుచ్చైః, గృహీత పరమాయుధైః
భుజై రష్టాభి రతులైః, వ్యాప్యాశేషం బభౌ నభః. 18.

ఓం త మాయాంతం సమాలోక్య, దేవీ శంఖ మవాదయత్
జ్యాశబ్దం చాపి ధనుషః, చకారాతీవ దుస్సహం. 19.

ఓం పూరయామాస కకుభో, నిజఘంటాస్వనేన చ
సమస్త దైత్య సైన్యానాం, తేజోవధ విధాయినా. 20.

ఓం తత స్సింహో మహానాదైః, త్యాజితేభమహామదైః
పూరయామాస గగనం, గాం తథైవ దిశోదశ. 21.

ఓం తతః కాళీ సముత్పత్య, గగనం క్ష్మ మతాడయత్
కరాభ్యాం తన్నినాదేన, ప్రాక్స్వనా స్తే తిరోహితాః. 22.

ఓం అట్టాట్టహాస మశివం, శివదూతీ చకారహ
తై శ్శబ్దై రసురాః త్రేసుః, శుంభః కోపం పరం యయౌ. 23.

ఓం దురాత్మన్ ! తిష్ఠతిష్ఠేతి, వ్యాజహా రాంబికా యదా
తదా జయే త్యభిహితం, దేవై రాకాశ సంస్థితైః. 24.

ఓం శుంభే నాగత్య యాశక్తిః, ముక్తా జ్వాలాతిభీషణా
ఆయాంతీ వహ్నికూటాభా, సా నిరస్తా మహోల్కయా. 25.

ఓం సింహనాదేన శుంభస్య, వ్యాప్తం లోకత్రయాంతరం
నిర్ఘాతనిస్వనో ఘోరో, జితవా నవనీపతే! 26.

16. ఆమీద అసురుడు గండ్రగొడ్డలి చేతబట్టి వచ్చుచుండగా దేవి బాణ సమూహముతో వానిని భూమిపై మూర్ఛపోవునట్లు పడఁగొట్టెను.

17. నిశుంభుడు క్రిందబడి తెలివి తప్పగా శుంభుఁడు మిక్కిలి కోపించి అంబికపైకి చంపఁబోయెను.

18. శుంభుడు రథముపై నెక్కి పొడగాటి ఎనిమిది భుజములతో ఉత్తమాయుధముల ధరించి. ఆకాశమంతటను వ్యాపించి వెలిగెను.

19. అట్లువచ్చు వానిని చూచి దేవి శంఖమూదెను. వింటినారిని మిక్కిలి దుస్సహముగా మ్రోయించెను.

20. రాక్షససేనల కన్నింటికి తేజముతరిగించునట్లు. దేవి తన ఘంటాధ్వనిని దిక్కులు పిక్కటిల్ల నింపెను.

21. సింహము కూడ ఏనుగుల మదము దిగజాఱునట్లు భూమి ఆకాశము దిక్కులు నిండునట్లు గర్జించెను.

22. అంతట కాళి రివ్వున ఆకాశమునకెగిరి, తనచేతులతో భూమిపై గట్టిగా తట్టెను. ఆశబ్దముతో అంతకుముందున్న ధ్వనులన్నియుఁ అస్తమించెను.

23. శివదూతి కీడును సూచించు బిట్టగునట్టహాసము చేయగా ఆధ్వనికి అసురులు వెఱచిరి. శుంభునకు పట్టరాని కోపము నెట్టుకొని వచ్చెను.

24. అంబిక 'ఓరీ దురాత్మా ! నిలు నిలు ! మని పలుకునంతలో. ఆకాశమందున్న దేవతలు దేవికి జయము పలికిరి.

25. శుంభుడు ప్రయోగించిన శక్తియను ఆయుధము అగ్గిముద్దవలె మంటలు క్రక్కుచు వచ్చుచుండగా దేవి దానిని ఉల్కావజ్రాయుధముతో ఉపసంహరించెను.

25. ఓ రాజా ! ముల్లోకములు శుంభుని సింహనాదములతో వ్యాపింపబడియుండగా, దానిని ఆ వజ్రాయుధపు నిష్ఠురధ్వని జయించెను.

ఓం శుంభముక్తాన్ శరాన్ దేవీ, శుంభః తత్ప్రహితాన్ శరాన్
చిచ్ఛేద స్వశరై రుగ్రైః, శతశోఽథ సహస్రశః. 27.

ఓం తత స్సా చండికా క్రుద్ధా, శూలే నాభిజఘాన తం
స తదాభిహతో భూమౌ, మూర్ఛితో నిపపాతహ. 28.

ఓం తతో నిశుంభ స్సంప్రాప్య, చేతనా మాత్తకార్ముకః
అజఘాన శరైర్దేవీం, కాళీం కేసరిణం తథా. 29.

ఓం పునశ్చ కృత్వా బాహూనా, మయుతం దనుజేశ్వరః
చక్రాయుతేన దితిజః, ఛాదయామాస చండికాం. 30.

ఓం తతో భగవతీ కు్రిద్ధా, దుర్గా దుర్గార్తి నాశినీ
చిచ్ఛేద తాని చక్రాణి, స్వశరై స్సాయకాంశ్చతాన్. 31.

ఓం తతో నిశుంభో వేగేన, గదా మాదాయ చండికాం
అభ్యధావత వై హంతుం, దైత్యసేనాసమావృతః. 32.

ఓం తస్యాపతత ఏవాశు, గదాం చిచ్ఛేద చండికా
ఖడ్గేన శితధారేణ, స చ శూలం సమాదదే. 33.

ఓం శూలహస్తం సమాయాంతం నిశుంభ మరిమర్దనం
హృది వివ్యాధ శూలేన, వేగావిద్ధేన చండికా. 34.

ఓం భిన్నస్య తస్య శూలేన, హృదయా న్నిసృతోఽపరః
మహాబలో మహావీర్యః, తిష్ఠేతి పురుషో వదన్. 35.

ఓం తస్య నిష్క్రామతో దేవీ, ప్రహస్య స్వనవ త్తతః
శిర శ్చిచ్ఛేద ఖడ్గేన, తతోఽసా వపత ద్భువి. 3౬.

ఓం తత స్సింహ శ్చఖాదోగ్రి, దంష్ట్రాక్షుణ్ణశిరోధరాన్
అసురాన్ తాన్ తథాకాళీ, శివదూతీ తథా పరాన్. 37.

27. నూర్లకొలదిగా ప్రయోగింపఁబడిన శుంభుని బాణములను దేవియు, దేవిబాణములను శుంభుడును తమతమ బాణములతో త్రుంచివైచిరి.

28. అంత ఆచండిక మండిపడి శుంభుని శూలముతో పొడిచెను. వాడును స్మృతితప్పి నేలపైబడెను.

29. అప్పటికి నిశుంభుడు తెలివి తెచ్చుకొని తేరుకొని ధనుస్సుగైకొని బాణములతో చండికను-కాళిని సింహమును అమ్ములతో ముంచి యెత్తెను.

30. నిశుంభుడు మరల పదివేల చేతులు కల్పించుకొని. పదివేల చక్రములతో దేవిని కప్పివైచెను.

31. అంత భగవతి యగు దుర్గ వానిచక్రములను బాణములను అన్నింటిని తనబాణములతో విరిచివైచెను.

32. నిశుంభు డప్పు డతిశీఘ్రముగా గద నెత్తుకొని రాక్షససేనలతో పరివేష్టింపబడి దేవిని చంపుటకై పరువాతెను.

33. మీదబడ వచ్చుచున్న వానిగదను వాడియంచు ఖడ్గముతో దేవి విరిచివైచెను. అంతవాడు వేంటనే శూలమును గైకొనెను.

34. శూలముతోవచ్చునిశుంభుని దేవియు తనశూలముతో వడిగా గ్రొమ్మన క్రుచ్చెను.

35. దేవి శూలముతోచీలిన నిశుంభుని హృదయమునుండి మరొక మహాబలుడు నిలునిలుమని పలుకుచు బయలువెడలెను.

36. దేవి వానినిచూచి గట్టిగా నవ్వుచు ఖడ్గముతో వానితల నఱకెను. వాడును క్రిందఁబడెను.

37. అంత సింహము కొందఱురాక్షసుల తలలను కోఱలతోకొఱికి నమలి మ్రింగెను. కాళియు శివదూతియు నట్లే మరికొందఱ భక్షించిరి.

ఓం కౌమారీ శక్తి నిర్భిన్నాః కేచి న్నేశు ర్మహాసురాః
బ్రహ్మాణీ మంత్రపూతేన, తోయేనాన్యే నిరాకృతాః. 38.

ఓం మాహేశ్వరీ త్రిశూలేన, భిన్నాః పేతు స్తథాపరే
వారాహీ తుండఘాతేన, కేచిత్ చూర్ణీకృతా భువి. 39.

ఓం ఖండం ఖండం చ చక్రేణ, వైష్ణవ్యా దానవాః కృతాః
వజ్రేణ చైంద్రీహస్తాగ్ర, విముక్తేన తథా పరే. 40.

ఓం కేచిత్ వినేశు రసురాః, కేచి న్నష్టా మహాహవాత్
భక్షితాశ్చాపరే కాళీ, శివదూతీ మృగాధిపైః. 44.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
నిశుంభవధోనామ నవమోఽధ్యాయః

| | |
|---|---|
| ఉవాచమంత్రాః 2. | ఏవం 41. |
| శ్లోకాః 39. | ఏవమాదితః 543. |

# దశమోఽధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం నిశుంభం నిహతం దృష్ట్వా, భ్రాతరం ప్రాణసమ్మితం
హన్యమానం బలం చైవ, శుంభః క్రుద్ధోఽబ్రవీ ద్వచః 2.

ఓం బలావలేపాత్ దుష్టే! త్వం, మా దుర్గే! గర్వ మావహ
అన్యాసాం బల మాశ్రిత్య, యుధ్యసే యాతిమానినీ. 3.

ఓం దేవ్యువాచ :—

ఓం ఏకైవాహం జగత్యత్ర, ద్వితీయా కా మమాపరా
పశ్యైతా దుష్ట! మయ్యేవ, విశంత్యో మద్విభూతయః. 5.

38. కొందఱుమహాసురులు కౌమారి శక్తితోచంపబడిరి. కొందఱు బ్రహ్మాణి మంత్రపూతమైన జలముతోనే అసువుల గోలుపోయిరి.

39. మాహేశ్వరి త్రిశూలముతోను, వారాహి తుండపుపోట్లతోను మరి కొందఱు మడసిరి.

40. వైష్ణవి చక్రముతోను, ఐంద్రి వజ్రముతోను రక్కసులు పెక్కురు మరణించిరి.

41. కొందఱు పరుగెత్తి పాఱిపోయిరి. కొందఱు చనిపోయిరి. కొందఱు కాళిచేత, శివదూతిచేత, సింహముచేత భక్షింపఁబడిరి.

నవమాధ్యయము.

# దశమాధ్యాయము

1. ఋషి యిట్లను.

2. ప్రాణమువంటి తమ్ముఁడు నిశుంభుడు చనిపోవుటను, చంపఁబడు చున్న సైన్యమునుచూచి శుంభుడు కోపముతో దేవి కిట్లనెను.

3. దుర్గా! నీవు దుష్టవు. బలము (సేన) కలదనెడి గర్వముతో పొగరుపడకుము. ఇతరులబలమాశ్రయించియుద్ధముచేయునీవు మహామానవతివి:

4. దేవి యిట్లను.

5. ఓరీదుష్టా! ఈ ప్రపంచమునందుండునది నేనొక్కతెనే. నాకంటె వేరెవరున్నారు? ఇదిగో చూడుము. వీరందఱు నా విభూతులే. నాయందే ప్రవేశించుచున్నారు.

ఓం తత స్సమస్తా స్తా దేవ్యో, బ్రహ్మాణీ ప్రముఖా లయం
తస్యా దేవ్యాః తనౌజగ్ముః, ఏకై వాసీ త్తదాంబికా. 6.

ఓం దే వ్యువాచ :— 7.

ఓం అహం విభూత్యా బహుభి, రిహరూపై ర్యదాస్థితా
త త్సంహృతం మయై కైవ. తిష్ఠా మ్యాజౌ స్థిరో భవ. 8.

ఓం ఋషి రువాచ :— 9.

ఓం తతః ప్రవవృతే యుద్ధం, దేవ్యా శ్శుంభస్య చోభయోః
పశ్యతాం సర్వదేవానాం, అసురాణాం చ దారుణం. 10.

ఓం శరవర్షైః శితైశ్శస్త్రైః, తథాస్త్రైశ్చైవ దారుణైః
తయోర్యుద్ధ మభూ ద్భూయః. సర్వలోక భయంకరం. 11.

ఓం దివ్యా న్యస్త్రాణి శతశో. ముముచే యాన్యథాంబికా
బభంజ తాని దైత్యేంద్రః, తత్ప్రతీఘాత కర్తృభిః. 12.

ఓం ముక్తాని తేన చాస్త్రాణి, దివ్యాని పరమేశ్వరీ
బభంజ లీలయై వోగ్ర, హుంకారో చ్చారణాదిభిః. 13.

ఓం తత శ్శరశతై ర్దేవీం, ఆచ్ఛాదయత సోఽసురః
సాపి తత్కుపితా దేవీ, ధను శ్చిచ్ఛేద చేషుభిః. 14.

ఓం ఛిన్నే ధనుషి దైత్యేంద్రః, తథా శ క్తిమథా దదే
చిచ్ఛేద దేవీ చక్రేణ, తా మప్యస్య కరే స్థితాం. 15.

ఓం తతః ఖడ్గ ముపాదాయ, శతచంద్రంచ భానుమత్
అభ్యధావత తాం దేవీం, దైత్యానా మధిపేశ్వరః. 16.

ఓం తస్యాపతత ఏవాశు, ఖడ్గం చిచ్ఛేద చండికా
ధనుర్ముక్తైః శితై ర్బాణైః, చర్మ చార్కకరామలం. 17.

6. అంతలోనే బ్రహ్మాణి మొదలగుదేవతలు ఆ చండికయొక్క శరీరము నందె లీనమయిరి. అంబిక ఒక్కతె మాత్రమే కాననయ్యెను.

7. దేవి యిట్లను.

8. నేనే పెక్కురూపముల గైకొని యింతవరకు యుద్ధము నందుంటిని. వానినన్నిటి నుప సంహరించితిని. ఇపుడొక్కతెనే. యుద్ధమున నిక స్థిరుడవుకమ్ము.

9. ఋషి యిట్లను.

10. అంత దేవీ శుంభుల కిరువురకు ఘోరయుద్ధము జరిగెను. దేవతలు రాక్షసులు కన్నార్పక తిలకించుచుండిరి.

11. బాణవర్షములతోను, వాడిశస్త్రములతోను ఘోరమగు అస్త్రములతోను లోకము లన్నింటికి భయంకరమగు పునర్యుద్ధము వారికిసంభవించెను.

12. అంబిక యేయే దివ్యాస్త్రములు ప్రయోగించునో, శంభుడు తత్ప్రతీ ఘాతములైన యస్త్రములతో వానిని భజించెను.

13. శుంభుడు ప్రయోగించిన దివ్యాయుధములను పరమేశ్వరి హుంకారము తోనే అనాయాసముగా త్రిప్పికొట్టెను.

14. రాక్షసుడు నూర్లకొలది బాణములతో దేవిని కప్పివైవగా, చండిక వానిధనుస్సును విరిచివైచెను.

15. వాడు శక్తిని చేబూనగా దేవి
ముతో ఛేదించెను.

16. రాక్షసేశ్వరుఁడు ఖడ్గమును మెఱయుచున్న శతచంద్రమను పలకను గైకొని దేవిపైకి పోయెను.

17. వాడువచ్చులోపలనే దేవి వాని ఖడ్గమును పలకను శరపరంపరలతో త్రుంచివైచెను.

ఓం అశ్వాంశ్చ పాతయామాస, రథం సారధినాసహ
హతాశ్వః స తదాదైత్యః, ఛిన్నధన్వా విసారథిః. 18.

ఓం జగ్రాహ ముద్గరం ఘోర, మంబికా నిధనోద్యతః
చిచ్ఛేదాపతత స్తస్య, ముద్గరం నిశితై శ్శరైః. 19.

ఓం తథాపి సోఽభ్యధావత్తాం, ముష్టి ముద్యమ్యవేగవాన్
సముష్టిం పాతయామాస, హృదయే దైత్యపుంగవః. 20.

ఓం దేవ్యాః, తం చాపి సాదేవీ, తలేనో ర స్యతాడయత్
తలప్రహారాభిహతో, నిపపాత మహీతలే. 21.

ఓం స దైత్యరాజ స్సహసా, పునరేవ తథోత్థితః
ఉత్పత్యచ ప్రగృహ్యోచ్చైః, దేవీం గగన మాస్థితః. 22.

ఓం తత్రాపి సా నిరాధారా, యుయుధే తేన చండికా 23.

ఓం నియుద్ధం ఖే తదా దైత్యః, చండికా చ పరస్పరం.
చక్రతుః ప్రథమం సిద్ధ, మునివిస్మయకారకం. 24.

ఓం తతో నియుద్ధం సుచిరం, కృత్వా తేనాంబికా సహ
ఉత్పాట్య భ్రామయామాస, చిక్షేప ధరణీతలే. 25.

ఓం స క్షిప్తో ధరణీం ప్రాప్య, ముష్టి ముద్యమ్యవేగవాన్
అభ్యధావత దుష్టాత్మా, చండికా నిధనేచ్ఛయా. 26.

ఓం త మాయాంతం తతోదేవీ, సర్వదైత్యజనేశ్వరం
జగత్యాం పాతయామాస, భిత్వా శూలేన వక్షసి. 27.

ఓం స గతాసుః పపాతోర్వ్యాం, దేవీ శూలాగ్రవిక్షతః
చాలయన్ సకలాం పృథ్వీం, సాబ్ధిద్వీపాం సపర్వతాం. 28.

ఓం తతః ప్రసన్న మఖిలం, హతే తస్మిన్ దురాత్మని
జగత్ స్వాస్థ్య మతీవాప, నిర్మలంచా భవ న్నభః. 29.

18. శుంభుని గుఱ్ఱములను సారథిని దేవి చంపెను. వాడు ధనువును రథ రథ్యములను బోగొట్టుకొని,

19. ఘోరమైన ముద్గరము (ఇనుపగుదియ) ను తీసికొని దేవినిచంప నుద్యుక్తుడుకాగా దేవి వాని ముద్గరమును ముక్కలు చేసెను.

20. అట్లయ్యు శుంభుడు పిడికిలి పట్టుకొని దేవి కెదురేగి ఆమె హృదయ మున గట్టిపెట్టు పెట్టెను.

21. అంబిక వానినిగూడ తన అఱచేతితో ఱొమ్మున తట్టడచెను. ఆదెబ్బతో వాడు నేలపై బడెను.

22. వెంటనే మరల లేచి శుంభుడు దేవి నొడిసిపట్టుకొని ఆకసమునకు చాల ఎత్తున కెగిరెను.

23. చండిక ఆకసముననే నిరాధారముగనే వానితోయుద్ధముచేయుచుండెను.

24. వారిరువురు నంతరిక్షమున చేయుచున్న బాహుయుద్ధము అపూర్వము మునివిస్మయకారకము నయ్యెను.

25. అట్లు చాలకాలము దేవి వానితో మల్లయుద్ధముచేసి లాఘవముతో వానిని చేతనెత్తి గిరగిరత్రిప్పి భూమిమీదికి విసరికొట్టెను.

26. శుంభుడు నేలమీదపడి దుమ్ముదులుపుకొని లేచి చండికను చంపు కోరి కతో ముష్టిని పైకెత్తుకొని పరుగున బోయెను.

27. అట్లు వచ్చుచున్న ఆ అఖిలాసుర నాయకుని ఱొమ్మున అంబిక శూల ముతో పొడిచి క్రిందఁబడవైచెను.

28. వాడు శూలపుమొన తాకున ప్రాణములనుగోలుపోయి, పర్వతసముద్ర ద్వీపముతోకూడిన భూమి చలించునట్లు నేలపై విరుచుకొనిపడెను.

29. ఆ దురాత్ముడు చచ్చుటతో ప్రపంచమంతయు ప్రసన్నమయ్యెను. జగత్తునకు స్వస్థతచేకూరెను. ఆకాశము నిర్మలమయ్యెను.

ఓం ఉత్పాతమేఘా సోల్కా-ఒయే, ప్రాగాసం స్తేశమం యయుః
సరితో మార్గవాహిన్యః, తథాసం స్తత్ర పాతితే. 30.

ఓం తతో దేవగణాస్సర్వే, హర్ష నిర్భర మానసాః
బభూవు ర్నిహతే తస్మిన్, గంధర్వా లలితం జగుః. 31.

ఓం అవాదయన్ తథైవాన్యే, ననృతు శ్చాప్సరోగణాః
వవుః పుణ్యా స్తథా వాతాః, సుప్రభోఒభూత్ దివాకరః. 32.

(జజ్వలు శ్చాగ్నయ శ్శాంతాః శాంతాదిగ్గజ నిస్వనాః)

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
శుంభాసుర వధోనామ దశమోఒధ్యాయః

ఉవాచ మంత్రాః 4. ఏవం 32.
అర్ధమంత్రాః 1. ఏవమాదితః 575.
శ్లోకమంత్రాః 27,

# ఏకాదశోఒధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం దేవ్యా హతే తత్ర మహాసురేంద్రే
సేంద్రాః సురా వహ్నిపురోగమా స్తాం
కాత్యాయనీం తుష్టువు రిష్టలాభాత్
వికాశివక్త్రాబ్జ వికాసి తాశాః. 2.

ఓం దేవి ! ప్రపన్నార్తిహరే ! ప్రసీద
ప్రసీద మాతః ! జగతోఒఖిలస్య
ప్రసీద విశ్వేశ్వరి ! పాహి విశ్వం
త్వ మీశ్వరీ దేవి ! చరాచరస్య. 3.

30. అంతకుముందేర్పడిన ఉత్పాత సూచకములైన మేఘములు ఉపశమించెను. నదీనదములు చక్కని మార్గముల ప్రవహించెను.

31. అంత దేవగణములన్నియు పట్టరాని సంతోషముతో నిండిపోయిరి. గంధర్వులు లలితముగా పాడిరి.

32. మఱికొందరు వాద్యములు మ్రోయించిరి. అప్సరసలు నాట్యముచేసిరి. తెమ్మెరలు కమ్మగా మలసెను. సూర్యుడు సుప్రభలతో వెలిగెను.

(ఆరిపోయిన యాగాగ్నులు మరల వెలిగెను. దిగ్గజఘోషము లాగిపోయెను.)

దశమాధ్యాయము.

# ఏకాదశాధ్యాయము

1. ఋషి యిట్లను.

2. దానవసార్వభౌముడైన ఆ శుంభుని దేవి సంహరించినంతనే ఇంద్రాది దేవతలందఱు అగ్నిదేవుని ముందిడుకొని ఇష్టార్థ సంసిద్ధివలని సంతోషముతో విప్పారిన ముఖములతో దిక్కుల వెలిగించుచు ఆ కాత్యాయనీ దేవిని స్తుతించిరి.

1. ప్రపన్నుల ఆపదలను తొలగించు ఓ దేవీ! ప్రసన్నురాలవగుము. అఖిల ప్రపంచములకు తల్లివి నీవు. చరాచరములకు ఈశ్వరివి. ప్రసన్నవై విశ్వమునంతటిని సంరక్షింపుము.

ఓం ఆధారభూతా జగత స్త్వమేకా
మహీస్వరూపేణ యతః స్థితాసి
అపాం స్వరూపస్థితయా త్వయైతత్
ఆప్యాయతే కృత్స్న మలంఘ్యవీర్యే. 4.

ఓం త్వం వైష్ణవీశక్తి రనంతవీర్యా
విశ్వస్యబీజం పరమాసి మాయా
సంమోహితం దేవి ! సమస్త మేతత్
త్వం వై ప్రసన్నా భువి ముక్తిహేతుః. 5.

ఓం విద్యా స్సమస్తాః తవ దేవి ! భేదాః
స్త్రియ స్సమస్తా స్సకలా జగత్సు
త్వ యైకయా పూరిత మంబ యైతత్
కాతేస్తుతిః స్తవ్యపరా పరోక్తిః. 6.

ఓం సర్వభూతా యదాదేవీ, భుక్తిముక్తి ప్రదాయిని !
త్వం స్తుతా స్తుతయే కావా, భవంతి పరమోక్తయః. 7.

ఓం సర్వస్య బుద్ధిరూపేణ, జనస్యహృది సంస్థితే
స్వర్గాపవర్గదే దేవి ! నారాయణి ! నమోస్తుతే. 8.

ఓం కళాకాష్ఠాదిరూపేణ, పరిణామ ప్రదాయిని !
విశ్వస్యోపరతౌ శక్తే, నారాయణి ! నమోస్తుతే. 9.

ఓం సర్వమంగళ మాంగల్యే !, శివే ! సర్వార్థసాధకే ?
శరణ్యే ! త్ర్యంబకే ! గౌరి ! నారాయణి ! నమోస్తుతే. 10.

ఓం సృష్టిస్థితి వినాశానాం, శక్తిభూతే ! సనాతని !
గుణాశ్రయే ! గుణమయే ! నారాయణి ! నమోస్తుతే. 11.

4. నీ వీర్యము నెవరు నతిక్రమింపఁజాలరు. నీవే భూమిరూపము వహించి జగత్తున కాధారమ వగుచున్నావు. నీవే జలరూపముతో నుండి సమస్తమునకు తృప్తి చేకూర్చుచున్నావు.

5. నీవే విష్ణుదేవుని శక్తివి. అంతులేని పరాక్రమముకలదానివి. విశ్వమునకు బీజమైన పరమమాయవు నీవె. నీ వలననే అంతయు సమ్మోహితమయినది. ప్రసన్నవగునీవే ముక్తికారణ మగుదువు.

6. లోకములోని విద్యలన్నియు నీ మూర్తి భేదములే. స్త్రీలందఱు నీయాకార విశేషములే. జగమంతయు ఒక్క నీచేతనే నిండియున్నవి. నిన్ను స్తుతింపఁదగిన వేఱుపలు కేమున్నది?

7. దేవి! నీవు 'సమస్తభూతస్వరూపిణివి. భుక్తిని ముక్తిని ఇచ్చుదానవు' అనిస్తుతింపబడితివి. అట్టినిన్ను పొగడుటకు ఏ మాటలు చాలును?

8. జనులందఱయొక్క హృదయములయందు బుద్ధిరూపముతోనుండి స్వర్గమును మోక్షమును ప్రసాదించు ఓ నారాయణీ! నీకు నమస్కారము.

9. ప్రపంచమునకు నీవే కల-కాష్ఠ అనెడి కాలప్రమాణ రూపముతో మార్పులుకలిగించి తుదకు అంతముచేయశక్తిగలిగిననీకునమస్కారము.

10. సమస్త మంగళములకు మంగళస్వరూపవు. జనులకు కావలసిన అన్నియర్థములను సాధింపగల శుభమూర్తివి. శరణము నొందఁదగినదానవు. మూడుకన్నులు కలిగినగౌరివి. నీకు నమస్కారములు.

11. జగముయొక్క సృష్టి స్థితిలయములుచేయు శక్తికలదానవు. మొదటినుండి యుండిన దానివి. గుణములకు ఆధారమవు. గుణరూపవు. నీకు నమస్కారము

ఓం శరణాగత దీనార్త, పరిత్రాణ పరాయణే!
సర్వస్యార్తిహరే! దేవి! నారాయణి! నమోస్తుతే. 12.

ఓం హంసయుక్త విమానస్థే!, బ్రహ్మాణీ రూపధారిణి!
కౌశాంభః క్షరికే! దేవి! నారాయణి! నమోస్తుతే. 13.

ఓం త్రిశూలచంద్రాహిధరే!, మహావృషభవాహిని!
మాహేశ్వరీ స్వరూపేణ, నారాయణి! నమోస్తుతే. 14.

ఓం మయూర కుక్కుటవృతే!, మహాశక్తిధరేఽనఘే!
కౌమారీ రూపసంస్థానే!, నారాయణి! నమోస్తుతే. 15.

ఓం శంఖచక్రగదాశార్ఙ్గ, గృహీత పరమాయుధే!
ప్రసీద వైష్ణవీరూపే! నారాయణి! నమోస్తుతే. 16.

ఓం గృహీతోగ్ర మహాచక్రే! దంష్ట్రోద్ధృత వసుంధరే!
వారాహరూపిణి! శివే! నారాయణి! నమోస్తుతే. 17.

ఓం నృసింహరూపే ణోగ్రేణ. హంతుం దైత్యాన్ కృతోద్యమే•
త్రైలోక్యత్రాణసహితే!, నారాయణి! నమోస్తుతే. 18.

ఓం కిరీటిని! మహావజ్రే! సహస్రనయనోజ్జ్వలే!
వృత్రప్రాణహరే! చైంద్రి! నారాయణి! నమోస్తుతే. 19.

ఓం శివదూతీ స్వరూపేణ, హతదైత్య మహాబలే!
ఘోరరూపే! మహారావే!, నారాయణి! నమోస్తుతే. 20

ఓం దంష్ట్రా కరాళవదనే!, శిరోమాలా విభూషణే!
చాముండే! ముండమథనే!, నారాయణి! నమోస్తుతే. 21.

ఓం లక్ష్మి! లజ్జే! మహావిద్యే! శ్రద్ధే! పుష్టి! స్వధే! ధ్రువే!
మహారాత్రి! మహామాయే! నారాయణి! నమోస్తుతే. 22.

12. నిన్ను శరణుచొచ్చిన దీనులను ఆర్తులను రక్షించుచేటే నీయాదర్శము. అందరకు కష్టములనుపాపుదానవు. దేవి! అట్టినీకు మానమస్కాము.

13. బ్రహ్మాణి రూపముతో హంసవిమానమునందుండి దర్భలతో పవిత్రమైన జలమునుచల్లి శత్రుల సంహరించిన నీకు మా నమస్కారము.

14. మాహేశ్వరిరూపముతో త్రిశూలము-చంద్రరేఖ-సర్పములను ధరించి మహావృషభవాహనము నెక్కిన నీకు మానమస్కారము.

15. కౌమారీ రూపముతో నెమలిని-కుక్కుటమును చేరదీసి-మహాశక్తి అను ఆయుధమును ధరించిన నీకు మానమస్కారము.

16. వైష్ణవి రూపముతో శంఖము-చక్రము-గద శార్ఙ్గములను ఉత్తమాయుధముల స్వీకరించిన దేవి! ప్రసన్నవగుము. నీకు మానమస్కారము.

17. వారాహిరూపముతో ఘోరచక్రమును ధరించి కోరలతో భూమిని సముద్రమునుండి పైకెత్తిన నీకు మానమస్కారము.

18. ఉగ్రమైన నరసింహరూపముతో రాక్షసుల సంహరించుటకు పూని, త్రిలోకముల సంరక్షణ భారము వహించిన నీకు మానమస్కారము.

19 కిరీటము-మహావజ్రాయుధము-ధరించి వేయికన్నులతో వెలుగుచు. వృత్రునిప్రాణములనుహరించిన ఐంద్రిరూపకు నీకు మానమస్కారము.

20. ఘోరరూపము-మహారావము గలిగి, దైతేయుల బలముల సంహరించిన శివదూతీ రూపముతోనున్న నీకు మా నమస్కాము.

21. కోరలతో భయంకరమయిన నోరు-నరశిరముల ఆభరణము ధరించి ముండుని మథించిన చాముండారూపవగు నీకు మానమస్కారము.

22. లక్ష్మివి-లజ్జవు-మహావిద్యవు-శ్రద్ధవు-పుష్టివి-స్వధవు-ధ్రువవు. మహారాత్రివి-మహామాయవు అగు నీకు మానమస్కారము.

ఓం మేధే ! సరస్వతి ! వరే ! భూతి ! బాభ్రవి ! తామసి !
నియతేత్వం ప్రసీదేశే ! నారాయణి ! నమోస్తుతే. 23.

ఓం సర్వస్వరూపే ! సర్వేశే ! సర్వశక్తి సమన్వితే !
భయేభ్య స్త్రాహి నో దేవి దుర్గే ! దేవి ! నమోస్తుతే. 24.

ఓం ఏతత్తే వదనం సౌమ్యం, లోచనత్రయ భూషితం
పాతునః సర్వభూతేభ్యో, కాత్యాయని ! నమోస్తుతే. 25.

ఓం జ్వాలాకరాళ మత్యుగ్ర, మశేషాసుర సూదనం
త్రిశూలం పాతునోభీతేః, భద్రకాళి ! నమోస్తుతే. 26.

ఓం హినస్తి దైత్యతేజాంసి, స్వనే నాపూర్య యా జగత్
సా ఘంటా పాతునో దేవి ! పాపేభ్యోనః సుతానివ. 27.

ఓం అసురాసృ గ్వసాపంక, చర్చిత స్తే కరోజ్జ్వలః
శుభాయ ఖడ్గోభవతు, చండికే త్వాం నతావ యం. 28.

ఓం రోగా నశేషా నపహంసి తుష్టా
రుష్టాతు కామాన్ సకలా నభీష్టాన్
త్వా మాశ్రితానాం నవిప న్నరాణాం
త్వా మాశ్రితా హ్యాశ్రియతాం ప్రయాంతి. 29.

ఓం ఏతత్కృతం య త్కదనం త్వయాద్య
ధర్మద్విషాం దేవి ! మహాసురాణాం
రూపై రనేకై ః బహుధాఽత్మ మూర్తిం
కృత్వాఽంబికే ! తత్ప్రకరోతి కాన్యా. 30.

ఓం విద్యాసు శా స్త్రేషు వివేకదీపే
ష్వాద్యేషు వాక్యేషు చ కా త్వదన్యా ?
మమత్వగ ర్తేఽ తి మహాంధకారే
విభ్రామయ త్యేత దతీవ విశ్వం. 31.

23. మేధవు. సరస్వతివి. శ్రేష్ఠవు. భూతి (సంపద) వి. రజోగుణవు. తమో గుణవు. నియతవు. అట్టిదేవి ప్రసన్నవగుము. నీకు మానమస్కారము.

24. సర్వస్వరూపవు. సర్వేశ్వరివి. సర్వశక్తులతోకూడినదానవు అగుదేవి! దుర్గా! మమ్ము భయములనుండి కాపాడుము. నీకు మానమస్కారము.

25. ఓ కాత్యాయని! మూడుకనులతో అలంకరింపబడి సౌమ్యమైన యీనీ ముఖము సర్వభూతములనుండి కాపాడుగాక. నీకు మానమస్కారము.

26. ఓ భద్రకాళీ! అగ్నిజ్వాలలతో భయంకరమై, అశేషదానవుల సంహ రించిన నీత్రిశూలము భయములనుండి మమ్ము బ్రోచుగాక! నీకు మా నమస్కారము.

27. తన ఘననినాదముతో ప్రపంచమునునింపి, దైత్యులతేజమును అపహ రించిన నీ చేతియందలిఘంట తనబిడ్డలవలె పాపములనుండి మమ్ము రక్షించుగాక!

28. అసురుల నెత్తురు బురదతో పూయఁబడిన నీచేతిలోనిఖడ్గము మా శుభ ములకే యగుగాక. చండికా! నీకు మేము నమస్కరించెదము.

29. దేవీ! నీవు తృప్తినందినయెడల రోగములనన్నిటిని అపహరింతువు. కోపించినచో కోరికల నన్నటిని కూలుతువు. నిన్నాశ్రయించినవారికి ఆపదలంటవు. అంతేకాదు వారితరుల కాశ్రియము కాఁజాలుదురు.

30. దేవీ! అనేకరూపములతో నీ మూర్తిని కల్పించుకొని ధర్మవిధ్వంసకు లగు రాక్షసులతో ఇప్పుడు నీవొనరించిన ఇట్టియుద్ధము మరెవరు చేయఁగలుగుదురు?

31. వివేక దీపములైన విద్యలయందును, శాస్త్రములందును, వేదము లందలి వాక్యములందును నీకంటె వేరెవరున్నారు? నీవే యీ విశ్వ మును మహాంధకారమైన మమతయను గుంతలో భ్రమించునట్లు చేయుచున్నావు.

ఓం రక్షాంసి యత్రోగ్ర విషాశ్చ నాగా
యత్రారయో దస్యుబలాని యత్ర
దావానలో యత్ర తథాబ్ధి మధ్యే
తత్ర స్థితాత్వం పరిపాసి విశ్వం. 32.

ఓం విశ్వేశ్వరీ త్వం, పరిపాసి విశ్వం
విశ్వాత్మికా ధారయసీహ విశ్వం
విశ్వేశవంద్యా భవతీ భవంతి
విశ్వాశ్రయా యే త్వయి భక్తినమ్రాః. 33.

ఓం దేవి ! ప్రసీద పరిపాలయ నోఽరిభీతేః
నిత్యం యథాసురవధా దధునైవ సద్యః
పాపాని సర్వజగతాం ప్రథమం నయాశు
ఉత్పాత పాకజనితాంశ్చ మహోపసర్గాన్. 34.

ఓం ప్రణతానాం ప్రసీదత్వం, దేవి ! విశ్వార్తిహారిణి !
త్రైలోక్యవాసినా మీడ్యే ! లోకానాం వరదా భవ. 35.

ఓం దేవ్యువాచ :— 36.

ఓం వరదాఽహం సురగణా ! వరం యం మనసేచ్ఛథ
తం వృణుధ్వం ప్రయచ్ఛామి, జగతా ముపకారకం. 37.

ఓం దేవా ఊచుః :— 38.

ఓం సర్వబాధా ప్రశమనం, త్రైలోక్య స్యాఖిలేశ్వరి !
ఏవ మేవ త్వయా కార్యం, అస్మద్వైరి వినాశనం. 39.

ఓం దేవ్యువాచ :— 40.

ఓం వైవస్వతేఽంతరే ప్రాప్తేఽ ష్టావింశతి తమే యుగే
శుంభో నిశుంభ శ్చైవాన్యా, వుత్పత్స్యేతే మహాసురా. 41.

32. ఎక్కడెక్కడ రక్కసులు, విషసర్పములు, శత్రువులు, దొంగలు, దావానలము కలుగుదురో అక్కడను సముద్రమధ్యమునందును నీవు నిలిచి విశ్వమును కాపాడుచున్నావు.

33. నీవు విశ్వేశ్వరివి. విశ్వమును పరిపాలింతువు. విశ్వాత్మికవై విశ్వమంతయు ధరియింతువు. నీవు విశ్వేశవంద్యవు. నీయందు భక్తినమ్రులైనవారు విశ్వమునకే ఆశ్రయమగుదురు.

34. దేవీ! కరుణింపుము. శత్రుభయమునుండి మమ్ము నిత్యమును ఇప్పటివలెనే రాక్షసులను వధించి రక్షింపుము. సర్వజగముల పాపములను, దుశ్శకునములతో కలిగిన గొప్ప విపత్తులను, త్వరగా శమింపఁజేయుము.

35. విశ్వార్తిహారిణివగు దేవీ! ప్రణతులమైన మాకు ప్రసన్నవగుము. ముల్లోకముల నున్నవారికి నీవే ప్రార్థింపదగినదానవు, నీవు లోకములకు వరదవుకమ్ము.

36. దేవి యిట్లను.

37. దేవగణములారా! నేనుమీకు వరమిత్తును. జగములకుపకారకమగు దేనినైనను మీ మనసున కిష్టమైనదానిని కోరుకొనుడు.

38. దేవత లిట్లనిరి.

39. ఓ అఖిలేశ్వరి! ముల్లోకములకు సర్వబాధాప్రశమనముగ మా శత్రు వినాశమును ఇప్పటివలెనే ఎప్పటికిని చేయుచుండవలయును.

40. దేవి యిట్లను.

41. వైవస్వత మన్వంతరమున ఇరువదియెనిమిదవ యుగమున ఇప్పటి శుంభనిశుంభులు మరల వేరొకరూపముతో పుట్టబోవుదురు.

ఓం నంద గోపగృహే జాతా, యశోదాగర్భసంభవా
తత స్తౌ నాశయిష్యామి, వింధ్యాచల నివాసినీ. 42.

ఓం పున రప్యతి రౌద్రేణ, రూపేణ పృధివీతలే
అవతీర్య హనిష్యామి, వై ప్రచిత్తాంశ్చ దానవాన్. 43.

ఓం భక్షయం త్యాశ్చ తానుగ్రాన్, వైప్రచిత్తాన్ మహాసురాన్
రక్తా దంతా భవిష్యంతి, దాడిమీ కుసుమోపమాః. 44.

ఓం తతో మాం దేవతాస్సర్వే, మర్త్యలోకేచ మానవాః
స్తువంత్యో వ్యాహరిష్యంతి, సతతం రక్తదంతికాం. 45.

ఓం భూయశ్చ శతవార్షిక్యాం, అనావృష్ట్యా మనంభసి
మునిభి స్సంస్తుతా భూమౌ, సంభవిష్యా మ్యయోనిజా. 46.

ఓం తత శ్శతేన నేత్రాణాం, నిరీక్షిష్యామి యన్మునీన్
కీర్తయిష్యంతి మనుజాః, శతాక్షీ మితి మాం తతః. 47.

ఓం తతోహ మఖిలం లోక, మాత్మదేహ సముద్భవైః
భరిష్యామి సురా ! శ్శాకైః, ఆవృష్టేః ప్రాణధారకైః. 48.

ఓం శాకంభరీతి విఖ్యాతిం, తదాయస్యా మ్యహంభువి. 49.

ఓం తత్రైవచ వధిష్యామి, దుర్గమాఖ్యం మహాసురం
దుర్గా దేవీతి విఖ్యాతం, తన్మేనామ భవిష్యతి. 50.

ఓం పున శ్చాహం యదా భీమం, రూపం కృత్వా హిమాచలే
రక్షాంసి క్షపయిష్యామి, మునీనాం త్రాణకారణాత్. 51.

ఓం తదా మాం మునయ స్సర్వే, స్తోష్యం త్యానమ్రమూర్తయః
భీమాదేవీతి విఖ్యాతం, తన్మేనామ భవిష్యతి. 52.

ఓం యదాఽరుణాఖ్య స్త్రైలోక్యే, మహాబాధాం కరిష్యతి
తదాఽహం భ్రామరం రూపం, కృత్వాఽసంఖ్యేయ షట్పదం. 53.

42. అపుడు నేను నందగోపునింట యశోదాగర్భమునందు పుట్టి వింధ్యాచలమున నివసించుచు వారిని నశింపఁజేయుదును.

43. మరల భూమియందు అతిరౌద్రమైన రూపముతో నేనవతరించి వైప్రచిత్తులను దానవులను సంహరింతును.

44. ఆ వైప్రచిత్తులను భక్షించువేళ నాదంతములు దాడిమపూవులవలె రక్తవర్ణములగును.

45. అపుడు నన్ను దేవతలును, మానవులును పొగడుచు రక్తదంతిక యని వ్యవహరింతురు.

46. మరల నొకప్పుడు నీటిచుక్కలేకుండ నూఱేండ్లు అనావృష్టికలుగును. అపుడు మునుల ప్రార్థనతో అయోనిజగా నవతరింతును.

47. అపుడు మునులను నూఱుకన్నులతో కనిపెట్టి చూచుచుండుటవలన నన్ను శతాక్షి యని కీర్తింతురు.

48. అపుడే నా దేహమున మొలచిన ప్రాణధారకములైన శాకములతో వానలు వచ్చువరకు లోకములను భరింతును.

49. అపుడు నేను శాకంభరియని పేరుపొందుదును.

50. అక్కడనే దుర్గముఁడను మహాసురుని వధింతును. అందువలన దుర్గాదేవి యని నాకు ప్రసిద్ధ నామమేర్పడును.

51. మరల నొకపరి నేను భీమమైనరూపమును తీసికొని హిమాలయమునందు మునుల సంరక్షణమునకై రాక్షసులను సంహరింతును.

52. అపుడు మునులందరు భక్తితో వినమ్రులై నన్ను భీమాదేవియని స్తుతింతురు. అదియు నాకు పేరుగనగును.

53. అరుణుడను రాక్షసుండు ముల్లోకములకు మహాబాధను కలిగించినపుడు నేను లెక్కకుమీరిన తుమ్మెదల రూపమును దాల్తును.

ఓం త్రైలోక్యస్య హితార్థాయ, వధిష్యామి మహాసురం
భ్రామరీతిచ మాం లోకాః, తదాస్తోష్యంతి సర్వతః. 54.

ఓం ఇత్థం యదాయదాబాధా. దానవోత్థా భవిష్యతి
తదా తదాఽ వతీర్యాహం, కరిష్యా మ్యరిసంక్షయం. 55.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
నారాయణీస్తుతిర్నామ ఏకాదశోఽధ్యాయః

ఉవాచ మంత్రాః 4. ఏవం 55.
అర్ధమంత్రాః 1. ఏవమాదితః 630.
శ్లోకమంత్రాః 50.

# ద్వాదశోఽధ్యాయః

ఓం దేవ్యువాచ :— 1.

ఓం ఏభిస్తవైశ్చ మాం నిత్యం, స్తోష్యతే య స్సమాహితః
తస్యాహం సకలాం బాధాం, శమయిష్యా మ్యసంశయం 2.

ఓం మధుకైటభ నాశంచ, మహిషాసుర ఘాతనం
కీర్తయిష్యంతి యే తద్వత్, వధం శుంభనిశుంభయోః. 3.

ఓం అష్టమ్యాంచ చతుర్దశ్యాం, నవమ్యాం చైకచేతసః
శ్రోష్యంతి చైవ యే భక్త్యా. మమ మాహాత్మ్య ముత్తమం. 4.

ఓం న తేషాం దుష్కృతం కించిత్, దుష్కృతోత్థా నచాపదః
భవిష్యతి న దారిద్ర్యం, న చైవేష్ట వియోజనం. 5.

ఓం శత్రుతో న భయం తస్య, దస్యుతోవా న రాజతః
న శస్త్రానలతోయౌఘాత్, కదాచిత్ సంభవిష్యతి. 6.

54. మూడులోకముల హితముకొఱకు ఆమహాసురుని వధింతును. అపుడు లోకులు నన్ను భ్రామరియని స్తుతింతురు.

55. ఇట్లు దానవులవలన ఎప్పుడెప్పుడు బాధలు కలుగునో అప్పుడప్పుడెల్ల నే నవతరించి శత్రునాశము చేయుచుందును.

ఏకాదశాధ్యాయము.

# ద్వాదశాధ్యాయము.

1. దేవి యిట్లను,

2, 3, 4 ఈ స్తోత్రములతో నన్ను శ్రద్ధాభక్తులు కలిగి నిత్యము స్తుతించినను, అష్టమీ, నవమీ, చతుర్దశీ దినములందు ఏకాగ్రమైన మనస్సుతో మధుకైటభ సంహారము, మహిషాసురవధ, శుంభనిశుంభ హననము, అను చరిత్రత్రయముగల నా (దేవీ) మాహాత్మ్యమును కీర్తించినను, విన్నను, సకలమైన బాధలను శమింపఁ జేయుదును.

5. అట్లు కీర్తించి విన్నవారలకు పాపమును; దానివలని ఆపదలును కలుగవు. దారిద్ర్యము ఇష్టజనవియోగము సంభవింపవు.

6. శత్రువులతోగాని, దొంగలతోగాని, రాజులవలనగాని, శస్త్రము అగ్ని, వాయువు, నీరు మొదలగువానివలనగాని భయములెప్పటికిసంభవింపవు.

ఓం తస్మాన్మమైత న్మాహాత్మ్యం, పఠితవ్యం సమాహితైః
శ్రోతవ్యంచ సదాభక్త్యా, పరం స్వస్త్యయనం మహత్. 7.

ఓం ఉపసర్గా నశేషాం స్తు, మహామారీ సముద్భవాన్.
తథా త్రివిధ ముత్పాతం, మాహాత్మ్యం శమయేన్మమ. 8.

ఓం యత్రైతత్ పఠ్యతే సమ్యక్, నిత్యమాయతనే మమ
సదా న త ద్విమోక్ష్యామి, సాన్నిధ్యం తత్రమే స్థితం. 9.

ఓం బలిప్రదానే పూజాయాం, అగ్నికార్యే మహోత్సవే
సర్వం మమైత చ్చరితం, ఉచ్చార్యం శ్రావ్యమేవచ. 10.

ఓం జానతాఽజా నతా వాపి, బలిపూజాం తథాకృతాం
ప్రతీక్షిష్యా మ్యహంప్రీత్యా. వహ్నిహోమం తథాకృతం. 11.

ఓం శరత్కాలే మహాపూజా, క్రియతే యాచ వార్షికీ
తస్యాం మమైత న్మాహాత్మ్యం, శ్రుత్వా భక్తిసమన్వితః. 12.

ఓం సర్వబాధా వినిర్ముక్తో, ధనధాన్య సుతాన్వితః
మనుష్యో మత్ప్రసాదేన, భవిష్యతి నసంశయః. 13.

ఓం శ్రుత్వా మమైత న్మాహాత్మ్యం, తథా చోత్పత్తయ శ్శుభాః
పరాక్రమంచ యుద్ధేషు, జాయతే నిర్భయః పుమాన్. 14.

ఓం రిపవః సంక్షయం యాంతి, కల్యాణం చోపపద్యతే
నందతేచ కులం పుంసాం. మాహాత్మ్యం మమ శృణ్వతాం. 15.

ఓం శాంతికర్మణి సర్వత్ర, తథా దుస్స్వప్నదర్శనే
గ్రహపీడాసు చోగ్రాసు, మాహాత్మ్యం శృణుయాన్మమ. 16.

ఓం ఉపసర్గాః శమం యాంతి, గ్రహపీడాశ్చ దారుణాః
దుస్స్వప్నంచ నృభిర్దృష్టం, సుస్వప్న ముపజాయతే. 17.

7. అందువలన నాయీ మాహాత్మ్యము శ్రద్ధావంతులచేత పఠింపఁదగినది. వినఁదగినది. అది శ్రేష్ఠమైన అభ్యుదయమార్గము.

8. మహామారివలన గలిగిన అశేష ఉపద్రవములను. భౌమ. అంతరిక్ష, దివ్యములనెడి త్రివిధోత్పాతములను నా మాహాత్మ్యము శమింపఁ జేయును,

9. ఎక్కడెక్కడ ఏయింటియందు నా మాహాత్మ్యము నిత్యము పఠింపఁ బడునో నేనాస్థలముననే నిత్యము వసింతును. విడిచివెళ్ళను.

10. బలిసమర్పణ, పూజా, అగ్నికార్య మహోత్సవ సందర్భములందు నా చరిత్రమంతయును పఠింపఁదగినది, వినఁదగినది.

11. సక్రమ సమగ్ర విధానము తెలిసికాని, తెలియకకాని చేసిన బలిపూజలను, అగ్నిహోమమును నేను ప్రీతితోగ్రహింప ప్రతీక్షించుచుందును.

12. ఏటేటను శరదృతువునందు (ఆశ్వీజమున) నన్నుగుఱించి మహాపూజ జరుగునపుడు భక్తితో నా మహిమము వినినమానవులు,

13. సర్వబాధలనుండి విడివడి, ధనధాన్య సుతాదులతోకూడి, నా ప్రసాదము వలన సుఖవంతులగుదురు. ఇందులకు సంశయములేదు.

14. ఈ నా మాహాత్మ్యమును, శుభప్రదములైన నా అవతారములును, యుద్ధములందు నా పరాక్రమములు విన్నవారలకు నిర్భయత కల్గును.

15. శత్రువులు నాశము నొందుదురు. మంగళము కలుగును. కులములు విలసిల్లును.

16. శాంతి కర్మలయందును, దుస్స్వప్నము లగుపడినపుడును, తీవ్రమైన గ్రహపీడలయందును, నా మాహాత్మ్యము వినదగినది.

17. అట్లు విన్నచో ఉపద్రవములుశమించును. ఘోరమైన గ్రహపీడలును, శాంతించును. దుస్స్వప్నములు సుస్వప్నములుగా పరిణమించును.

ఓం బాలగ్రహాభిభూతానాం, బాలానాం శాంతికారకం
సంఘాత భేదేచ నృణాం, మైత్రీకరణ ముత్తమం. 18.

ఓం దుర్వృత్తానా మశేషాణాం, బలహానికరం పరం
రక్షోభూత పిశాచానాం. పఠనా దేవనాశనం. 19.

ఓం సర్వం మమైతన్మాహాత్మ్యం, మమసన్నిధికారకం
పశుపుష్పార్ఘ్య ధూపైశ్చ, గంధదీపై స్తథోత్తమైః. 20.

ఓం విప్రాణాం భోజనైః హోమైః, ప్రోక్షణీయై రహర్నిశం
అన్యైశ్చ వివిధైర్భోగైః, ప్రదానై ర్వత్సరేణయా. 21.

ఓం ప్రీతి ర్మే క్రియతే సాస్మిన్, సకృ దుచ్చరితే శ్రుతే
శ్రుతం హరతి పాపాని, తథారోగ్యం ప్రయచ్ఛతి. 22.

ఓం రక్షాం కరోతి భూతేభ్యో, జన్మనాం కీర్తనం మమ
యుద్ధేషు చరితం యన్మే, దుష్టదైత్య నిబర్హణం. 23.

ఓం తస్మిన్ ఛ్రుతే వైరికృతం, భయం పుంసాం నజాయతే. 24.

ఓం యుష్మాభి స్తుతయో యాశ్చ, యాశ్చ బ్రహ్మర్షిభిః కృతాః
బ్రహ్మణాచ కృతాస్తాస్తు, ప్రయచ్ఛంతి శుభాం మతిం. 25.

ఓం అరణ్యేప్రాంతరేవాపి, దావాగ్ని పరివారితః
దస్యుభిర్వా వృతశ్శూన్యే, గృహీతోవాపి శత్రుభిః. 26.

ఓం సింహవ్యాఘ్రానుయాతోవా, వనేవా వనహస్తిభిః
రాజ్ఞాకృద్ధేన చాజ్ఞప్తో, వధ్యోబంధ గతోపివా. 27.

ఓం అఘూర్ణితోవా వాతేన, స్థితః పోతే మహార్ణవే
పతత్సు చాపి శస్త్రేషు, సంగ్రామే భృశదారుణే. 28.

18. నా మాహాత్మ్యము, బాలగ్రహములు సోకినబిడ్డలకు శాంతి కలిగించును. స్నేహాభావము చెడిపోయినవారలకు మరల మైత్రినికలిగించును.

19. దుష్టస్వభావులకు బలము తగ్గించును. పఠనమాత్రముననే రాక్షస భూత, పిశాచములు నశించును.

20. ఈ మాహాత్మ్యమంతయును నా సన్నిధిని కల్పించును. ఉత్తమము లైన పశు, పుష్ప, అర్ఘ్య, ధూప, గంధ దీపములతోను,

21. బ్రాహ్మణ భోజనములతోను, హోమములతోను, మంత్రోదక ప్రోక్షణముతోను, ఇంకను వివిధములైన భోగములతోను ఒక సంవత్సరము ఎడతెగకుండ చేయుటవలన కలుగు తృప్తిని,

22. ఒక్కసారి వినుటవలననే నాకు కలిగించును. వినికియే పాపముల పోగొట్టి ఆరోగ్యమును కలిగించును.

23. నా జన్మములనుగూర్చి కీర్తించుటవలన సకల భూతములనుండి రక్షణము కలిగించును. నా యుద్ధములలోని దుష్టరాక్షససంహారమును,

24. వినినమానవులకు శత్రువులవలన భయముకలుగదు.

25. మీరును (దేవతలు) బ్రహ్మర్షులును, బ్రహ్మయు, సలిపినస్తుతులు శుభమయిన మతిని ప్రసాదించును.

26. అడవిలో శూన్యమార్గమందున్నను, దావాగ్ని (కార్చిచ్చు) చుట్టుకొనియున్నను,దొంగలుచుట్టుముట్టియున్నను శత్రువులుపట్టుకొన్నను,

27. అడవిలో సింగము, పులి, ఏనుగు తరుముకొని వచ్చునపుడును, రాజు కోపముతో మరణ, బంధ శిక్షలు విధించినపుడును,

28. మహాసముద్రమున ఓడలో సుడిగాలితో ఉత్పాత లూచఁబడుచున్నను, ఘోరయుద్ధమున శస్త్రములు పైబడుచున్నను,

ఓం సర్వబాధాసు ఘోరాసు, వేదనాభ్యర్దితోఽపివా
స్మర న్మమైత చ్చరితం, నరో ముచ్యేత సంకటాత్. 29.

ఓం మమ ప్రభావాత్ సింహాద్యా, దస్యవో వైరిణస్తథా
దూరాదేవ పలాయంతే, స్మరత శ్చరితం మమ. 30.

ఓం ఋషి రువాచ :— 31.

ఓం ఇత్యుక్త్వా సా భగవతీ, చండికా చండవిక్రమా
పశ్యతాం సర్వదేవానాం, తత్రై వాంతరధీయత. 32.

ఓం తేఽపి దేవా నిరాతంకాః, స్వాధికారాన్ యథాపురా
యజ్ఞభాగ భుజస్సర్వే, చక్రు ర్వినిహతారయః. 33.

ఓం దైత్యాశ్చ దేవ్యా నిహతే, శుంభే దేవరిపౌ యుధి
జగద్విధ్వంసకే తస్మిన్, మహోగ్రేఽ తులవిక్రమే. 34.

ఓం నిశుంభేచ మహావీర్యే, శేషాః పాతాళ మాయయుః 35.

ఓం ఏవం భగవతీ దేవీ, సా నిత్యాపి పునః పునః
సంభూయ కురుతేభూప !, జగతః పరిపాలనం. 36.

ఓం త యైత న్మోహ్యతే విశ్వం, సైవ విశ్వం ప్రసూయతే
సా యాచితాచ విజ్ఞానం, తుష్టా చర్ధిం ప్రయచ్ఛతి. 37.

ఓం వ్యాప్తం తయైతత్ సకలం, బ్రహ్మాండం మనుజేశ్వర !
మహాకాళ్యా మహాకాలే, మహామారీ స్వరూపయా. 38.

ఓం సైవ కాలే మహామారీ, సైవ సృష్టిర్భవ త్యజా
స్థితిం కరోతి భూతానాం, సైవకాలే సనాతనీ. 39.

ఓం భవకాలే నృణాం సైవ, లక్ష్మీః వృద్ధిప్రదాగృహే
సైవాఽభావే తథాఽలక్ష్మీః, వినాశాయోపజాయతే. 40.

29. ఘోరమైన సర్వబాధలయందు వేదనపడుచున్నను, నా చరిత్రమును స్మరించినయెడల నరుడు సంకటములనుండి విముక్తుఁడగును.

30. నా చరిత్రము స్మరించినయెడల నాప్రభావముతో సింహము మొదలగు క్రూరజంతువులు, చోరులు, శత్రువులు దూరమునుండియేపరుగెత్తుదురు.

31. ఋషి యిట్లను.

32. చండవిక్రమముగల ఆచండికాభగవతి ఇట్లుపలికి దేవతలందఱు చూచుచుండగ నక్కడనే అంతర్ధానము నందెను.

33. ఆ దేవతలందఱు భయములేనివారై ముందువలెనే యజ్ఞభాగముల భుజించుచు, తమతమ యధికారములను నిర్వహించిరి.

34. దైత్యులుకూడ తమ నాయకుడును, దేవతలకుశత్రువు, జగత్తును ధ్వంసముచేయువాడు, మహోగ్రవిక్రముడైన శుంభుడు దేవిచేత చంపబడగా.

35. నిశుంభుడును కూలిపోగా, మిగిలినరాక్షసులు పాతాళమునకు పోయిరి.

36. ఓ సురథమహారాజా : ఈరీతిగా భగవతి మాయాదేవి నిత్యయయ్యును మరలమరల అవతరించి జగమును పరిపాలించుచున్నది,

37. ఆమెయే ఈ విశ్వమును భ్రమపెట్టును, సృష్టించును, తనను ప్రార్థించినవారియెడ తుష్టయై విజ్ఞానము, అభివృద్ధి ప్రసాదించును.

38. ఈ బ్రహ్మాండమంతయు ఆమెచేతనే వ్యాపింపఁబడినది. మహాకాళియే మహాప్రళయసమయమున మహామారీస్వరూపముతో నుండును.

39. జన్మరహిత, నిత్య అగు ఆ మహామారియే ప్రపంచోత్పత్తి కావలసిన సమయమున సృష్టికారణభూత అగును. రక్షణవేళ ఆమెయే భూతములకు స్థితిని కలిగించును.

40. ఆమెయే నరులకు మంచికాలమునందు యింటిలో లక్ష్మీరూపముతో వృద్ధికలిగించును. కానివేళయందు అలక్ష్మియై వినాశము కలిగించును.

ఓం స్తుతా సంపూజితా పుష్పైః, గంధధూపాదిభి స్తథా
దదాతి విత్తం పుత్త్రాంశ్చ, మతిం ధర్మే తథా శుభాం. 41.

శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే దేవీమాహాత్మ్యే
భగవతీవాక్యంనామనామ ద్వాదశోఽధ్యాయః

| | | | |
|---|---|---|---|
| ఉవాచమంత్రాః | 2. | ఏవం | 41. |
| అర్థమంత్రాః | 2. | ఏవమాదితః | 671. |
| శ్లోకాః | 37. | | |

# త్రయోదశోఽధ్యాయః

ఓం ఋషి రువాచ :— 1.

ఓం ఏత త్తే కథితం భూప !, దేవీమాహాత్మ్య ముత్తమం. 2.

ఓం ఏవం ప్రభావా సాదేవీ, య యేదం ధార్యతే జగత్
విద్యా తథైవ క్రియతే, భగవద్విష్ణుమాయయా. 3.

ఓం త్వ యాత్వ మేష వైశ్యశ్చ, తథైవాన్యే వివేకినః
మోహ్యంతే మోహితాశ్చైవ, మోహమేష్యంతిచాపరే. 4.

ఓం తా ముపైహి మహారాజ !, శరణం పరమేశ్వరీం
ఆరాధితా సైవనృణాం, భోగస్వర్గాపవర్గదా. 5.

ఓం మార్కండేయ ఉవాచ :— 6.

ఓం ఇతి తస్య వచ శ్ర్శుత్వా, సురథ స్స నరాధిపః
ప్రణిపత్య మహాభాగం, త మృషిం శంసితవ్రతం. 7.

ఓం నిర్విణ్ణోతి మమత్వేన, రాజ్యాపహరణేన చ
జగామ సద్య స్తపసే, సచవైశ్యో మహామునే. 8.

41. ఆమెయే స్తుతింపఁబడినదియు, పుష్పధూప దీపాదులతో పూజింపఁ బడినదియునగుచు ధనము-పుత్త్రిలు-ధర్మమునందుశుభబుద్ధినిచ్చును.

ద్వాదశాధ్యాయము.

# త్రయోదశాధ్యాయము

1. ఋషి యిట్లను.

2. రాజా! ఇది యుత్తమమైనది దేవీమహాత్మ్యము నీకు తెలిపితిని.

3. ఆ మహా మాయాదేవి యిట్టి ప్రభావము కలది. ఆమెచేతనే యీ జగత్తంతయు ధరింపబడుచున్నది. ఆభగవతియైన విష్ణుమాయచేతనే జ్ఞానము జనించుచున్నది.

4. ఆదేవిచేతనే నీవును ఈవైశ్యుడును. మిగతవివేకవంతులు. మోహితు లగుచున్నారు. ఇదివరకు అయియుండిరి. ఇకముందుకూడ కాగలరు.

5. రాజా! నీ వాపరమేశ్వరిని శరణుపొందుము. నరులచే ఆరాధింపబడిన ఆమెయే భోగములను స్వర్గాపవర్గములను ఇచ్చును.

6. మార్కండేయు డిట్లను.

7. సురథుడను ఆరాజు ఈ రీతిగా ఆ మేధసుని వాక్యములువిని అనువ్రతు నికి నమస్కరించెను.

8. అతి మమకారముతోను రాజ్యము పోవుటతోను దుఃఖితుఁడైన సురథు డును, సమాధియను వైశ్యుడునువెంటనే తపస్సుచేయుటకై వెడలిరి.

ఓం సందర్శనార్థ మంబాయాః, నదీపులిన సంస్థితః
సచ వైశ్య స్తప స్తేపే, దేవీసూక్తం పరంజపన్. 9.

ఓం తౌ తస్మిన్ పులినే దేవ్యాః, కృత్వా మూర్తిం మహీ మయీం
అర్హణాం చక్రతు స్తస్యాః, పుష్పధూపాగ్ని తర్పణైః. 10.

ఓం నిరాహారౌ యతాహారౌ, తన్మనస్కౌ సమాహితౌ
దదతుస్తౌ బలించైవ, నిజగాత్రాసృ గుక్షితం. 11.

ఓం ఏవం సమారాధయతోః, త్రిభిర్వర్షైః యతాత్మనోః
పరితుష్టా జగద్ధాత్రీ, ప్రత్యక్షం ప్రాహ చండికా. 12.

ఓం దేవ్యువాచ :— 13.

ఓం యత్ప్రార్థ్యతే త్వయా భూప !, త్వయాచ కులనందన !
మత్తః తత్ప్రాప్యతాం సర్వం, పరితుష్టా దదామి తత్. 14.

ఓం మార్కండేయ ఉవాచ :— 15.

ఓం తతో వవ్రే నృపో రాజ్యం, అవిభ్రం శ్యన్యజన్మని
అత్రైవచ నిజంరాజ్యం, హతశత్రుబలం బలాత్. 16.

ఓం సోపి వైశ్య స్తతో జ్ఞానం, వవ్రే నిర్విణ్ణమానసః
మమేత్యహ మితి ప్రాజ్ఞః, సంగ విచ్యుతి కారకం. 17.

ఓం దేవ్యువాచ :— 18.

ఓం స్వల్పైరహోభిః నృపతే !, స్వం రాజ్యం ప్రాప్స్యతేభవాన్ 19.

ఓం హత్వా రిపూ నస్ఖలితం, తవ తత్ర భవిష్యతి 20.

ఓం మృతశ్చభూయః సంప్రాప్య, జన్మదేవాత్ వివస్వతః. 21.

ఓం సావర్ణికో మనుర్నామ, భవాన్ భువి భవిష్యతి. 22.

9. వైశ్యుడు దేవీసందర్శనముకోరి ఒక నది యిసుక తిన్నెలమీద దేవీ సూక్తమును జపించుచు తపించెను.

10. వారిరువురును ఆయిసుక తిన్నెలపై మృణ్మయమైన దేవీమూర్తిని చేసి కొని పుష్పములు,ధూపము-హోమము-తర్పణములతో పూజలు సల్పిరి.

11. నియమిత ఆహారము తీసుకొనుచు-క్రమముగ నిరాహారులగుచు-ఏకాగ్రమైనమనసుకల్గి తమశరీరమందలిరక్తమునతడిసినబలిసమర్పించిరి.

12. ఇట్లు ఆరాధన చేయుచు మూడేండ్లు గడచునంత జగన్మాత చండిక పరితుష్టిచెంది ప్రత్యక్షమై ఇట్లుపలికెను.

13. దేవి యిట్లను.

14. ఓరాజా! ఓయీ కులనందన (వైశ్యా!) మీరు దేనిని కోరితిరో దానిని నావలన పొందుఁడు నేను తృప్తిచెందితిని. మీకోరిక తీరుతును.

15. మార్కండేయు డిట్లను.

16. అంత నారాజు తనబలముతో శత్రుసైన్యమును గెలిచి తన రాజ్యము తనకు ప్రాప్తించుటయేకాక తరువాత జన్మమునందు కూడ తరగకుండ వలయునని కోరెను.

17. ప్రాజ్ఞుడైన ఆ వైశ్యుడు సంసారదుఃఖముతో ఉద్విగ్నమనస్కుడై 'నేనని-నాదియని' తగుఁలమును పోగొట్టునట్టి జ్ఞానమును ప్రసాదింపుమని కోరెను.

18. దేవి యిట్లను.

19. రాజా! కొలదిదినములలోనే నీవునీరాజ్యమును పొందగలవు.

20. నీ శత్రువులను గెలుచుటతో నీకదిలభించును. అది స్థిరముగానుండును.

21. ఈశరీరము విడిచి సూర్యుని వలన మరల జన్మము నందుదువు.

22. అపుడు సావర్ణికుడను పేర భూమియందు మనువువు కాగలవు.

ఓం వైశ్యవర్య : త్వయా యశ్చ. వరోఽస్మత్తోఽభి వాంఛితః. 23.

ఓం తం ప్రయచ్ఛామి సంసిద్ధ్యై. తవజ్ఞానం భవిష్యతి. 24.

ఓం మార్కండేయ ఉవాచ :— 25.

ఓం ఇతి దత్వాతయోర్దేవీ, యథాభిలషితం వరం
బభూవాంతర్హితాసద్యో, భక్త్యా తాభ్యా మభిష్టుతా. 26.

ఓం ఏవం దేవ్యా వరం లబ్ధ్వా, సురథః క్షత్రియర్షభః
సూర్యాజ్జన్మ సమాసాద్య, సావర్ణిః భవితా మనుః. 27.

ఓం ఇతి దత్వా తయోర్దేవీ, యథాభిలషితం వరం
బభూవాంతర్హితాసద్యో, భక్త్యాతాభ్యా మభిష్టుతా. 28.

ఓం ఏవం దేవ్యా వరం లబ్ధ్వా. సురథః క్షత్రియర్షభః
సూర్యాజ్జన్మ సమాసాద్య. సావర్ణి ర్భవితా మనుః. 29.

క్లీం—ఓం—శ్రీ మార్కండేయపురాణే సావర్ణికే మన్వంతరే
దేవీమాహాత్మ్యే సురథ వైశ్యయో ర్వరప్రదానంనామ
త్రయోదశోఽధ్యాయః.

| | | | |
|---|---|---|---|
| ఉవాచమంత్రాః | 6. | ఏవం | 29. |
| అర్ధమంత్రాః | 7. | ఏవమాదితః | 700. |
| శ్లోకమంత్రాః | 16. | | |

23. వైశ్యవర్య! నీవు నా వలన కోరిన వరమును.

24. ఇదే ఇచ్చుచున్నాను. నీకు జ్ఞానము కలుగును.

25. మార్కండేయుడిట్లను.

26. దేవి యీ రీతిగా వారు కోరిన వరములు వారికిచ్చి వారిచే భక్తితో స్తుతింపఁబడి అంతర్హిత అయ్యెను.

27. ఈ రీతిగా క్షత్రియ శ్రేష్ఠుడయిన సురథుఁడు దేవివలన వరముపొంది సూర్యునివలన జన్మమునంది సావర్ణిమనువు కాగలఁడు.

28. 26 శ్లోక తాత్పర్యమే.

29. 27

త్రయోదశాధ్యాయము.

